# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 1-12-1978 | సంచిక 3

—* ఈ సంచికలో *—



16—12—78 సంచికలో విశ్వనాథవారి సాహిత్య విమర్శ, దిగంబర కవిత్వం, పురాణ దంపతులు మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై

# కవిరాజ శిఖామణి కవితా హేల

— శ్రీ డా. అయ్యగారి నరసింహమూర్తి, ఎం. ఏ., పిహెచ్. డి.

ఆదికవి నన్నయ అనంతరము కవితను రసవత్కావ్యరచనకై వినియోగించినవాడు నన్నెచోడుడు. ఈతనికి రాజ్యపరమైన, కవితారాజ్యపరమైన, బిరుదములు గలవు అందు మొదటిని. "టెంకణాదిత్యుడు' అనఁగా 'దక్షిణదేశపు సూర్యుఁడు'. 'రెండవది' కవిరాజ శిఖామణి. కవిరాజనఁగ' కవులకు రాజు అను యౌగికార్థమే కాక ఆలంకారిక పరిభాషలో నిర్వచించినట్లు భాషావిశేషమున ఆయా ప్రబంధములందాయారసముల స్వాతంత్ర్యము వహించినవాఁడు 'అనుపారిభాషి' కార్థమును ఈతనియెడ నన్వర్థము. ఈ బిరుదద్వయ మీతనియెడ నన్వర్థమగుట అతిశయోక్తి కాదు.

ఈ కవివరేణ్యుడు సగరసుతులు, భగిరథుఁడు, రఘువుఁడు, కరికాలచోడుఁడు మొదలగు సూర్యవంశాధిపతుల వంశమునఁ బుట్టినవాఁడు. కలుపొన్నలు, కలుకోడి గుఱుతులుగాగల ఒరయూరున కధిపతి. కావేరీ తటమున నుండు ఒరయూరు పురంబునకు కోకః (కోడి) యను అభిధానము ద్రవిడ భాషలలో సుప్రసిద్ధము.

గద్యపద్యోభయమైన చంపూరీతిలో నడచిన ఈతని కావ్యము సలక్షణమైన యొక చక్కని ప్రౌఢబంధము. పంద్రెండాశ్వాసముల పరిమితిగలిగి రెండువేలపైచిలుకు పద్యగద్యములతో నొప్పి శ్రీకారముతో నారంభమై మంగళమహాశ్రీ వృత్తముతోడను, మంగళమహాశ్రీ శబ్దముతోడను పరిసమాప్తి నొందుచున్న ఈ గ్రంథరాజనామధేయము కుమార సంభవము

కావ్యాద్యంతములు శ్రీకారముతో పొలుపారెడు నీప్రబంధమునందలి ఆశ్వాసాంతగద్యలయందు కవి తన్నుగూర్చి ఈ రీతిగా చెప్పుకొనినాడు. 'ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్యశ్రీ పాదపంకజభ్రమరాయమాణ కవిరాజ శిఖామణి నన్నెచోడ ప్రణీతంబైన కుమార సంభవకథ'

కథాసూత్రమున కుమారజననము, తారకాసురునిపై కుమారస్వామి విజయమును వెల్లడించుచు శివపారమ్యమును, శివోత్కర్షను నిరుద్దష్టముగా నిరూపించునదే యైనను నీతడు విష్ణ్వాదిదైవతముల యెడ విద్వేషముకలవాడు మాత్రముకాడని ఈ కావ్యావతారిక యందలి వర్ణనలనుబట్టి తెలియుచున్నది. నాచనసోముని వలె నీతడును సర్వజ్ఞుడని చెప్పుటకుఁ దగిన యంశములీ కృతియందెన్నియో గలవు. ఇందు షట్త్రింశదలంకారములు, చతుర్విధబంధములు, చిత్రకవితారీతులు—ఇత్యాదులతోపాటు ఆయుర్వేద, ధనుర్వేద, రసవాదాది శాస్త్రవిషయములు కూడ సందర్భము ననుసరించి చెప్పబడినది.

ఈతడు ధరాధిపతియైనను 'గురుర్దేవో మహేశ్వరః' యను ప్రమాణమును విశ్వసించి గురునకు, ఈశ్వరునకు అభేదమును చెప్పి గురువగు జంగమ మల్లికార్జునకే యంకితమిచ్చి తన గురుతరమగు గురుభక్తిని, శివభక్తిని, లోకమునకు చాటి చెప్పినాడు. దేశాభిమానము, భాషాభిమానము ఈకవికి విశేషముగ గలవు.

సంస్కృత కవుల, వారి కవితల, ప్రభావ మీతనిపై నధికముగాఁ గలదు. తమిళ కర్ణాటాది ద్రావిడభాషల యందును ఈతనికి మంచిప్రవేశముగలదనుటకు ఆతని ప్రయోగవిశేషములే సాక్షిభూతములు. ఈతని కవిత 'సాహిత్య స్ఫురన్మాధురీ చారుప్రౌఢిమ' గలది. నన్నెచోడుని ప్రభావ మన్నిరీతుల అనంతర కవులపై కలదనుటకు వారి గ్రంథములే నిదర్శనములు. ఈతని భావనలు యుగకర్తలుగా వినుతికెక్కిన కవులనే యలరించిన వన ఈ గ్రంథప్రాశస్త్యమును గూర్చి వేఱుగ నుడువవలసిన యవసరము లేదు.

ప్రౌఢ కావ్య గణనా ప్రసంగవేళల కుమారసంభవ కావ్యమున కగ్రస్థానమీయవలసినదే. కేవలము కాలముచేతనే కాక కమనీయమగు తదితర సామగ్రిని బట్టియు ఈకావ్యమున కాడపీఠము వేయవలసినదే. అపుడు తెలుగు వాఙ్మయమున ప్రౌఢప్రబంధము లారు కాగలవు ఈ విషయము తెలుగు సాహిత్యమున కొక విశిష్టతను చేకూర్చుచున్న దనుటలో నభ్యంతర ముండదు. ఇట్టి అలఘుతరమగు కృతికి సమగ్రమగు వ్యాఖ్య వ్రాయించి లోకమున వ్యాప్తిగావింపవలసినబాధ్యత తెలుగును సుసంపన్నముచేయ కంకణము కట్టుకొనెడివారి భుజస్కంధములపైనున్నది. పాఠ్యాంశములందిందలి విషయములనుచేర్చి విద్యార్థులను తద్రసాస్వాదనమున కున్ముఖులను చేయవలసినబాధ్యత పండితులపైనున్నది. పేటికాంతర్గత రత్నమువలె నున్న కావ్యమువలన ప్రయోజన ముండదుగదా!

ప్రౌఢ కల్పనాసౌందర్యమున కీతడు ఉత్ప్రేక్షలతోపాటు భ్రాంతిమదలంకారములనుగూడ వాడి తన కావ్యకాంత శోభను ద్విగుణీకృత మొనర్చినాడు.

హరుని శిరమును మనోహరమైన సరసీరుహములతో నారాధింపఁదలంచిన హరి మృగాంకుని మలినాబ్జమని యెంచి పుచ్చుటకు చేయిచాపగా హిమకరుడా కరమును రాహువని భ్రమించి భీరుడై పారిపోవుచుండ నాయిరువురి భ్రాంతిని దర్శించిన భవుడు హసించినాడట.

హరి వికచామలాంబుజ స
 హస్రముఁ బూన్చి మృగాంకునందు వి
స్ఫురిత మలాసిలాబ్జమని
 పుచ్చఁగఁ జూచినఁ జేయిచూచి చం
దురు డది రాహుసావి వెఱఁ
 దుప్పలఁదూలఁగ జూఱుచున్న న
య్యురువురఁ జూచినవ్వ పర
 మేశ్వరు డీవుత మా కభీష్టముల్
(1-3)

కవి సమ్మతమగు సాదృశ్యముచే నుపమేయము మఱుగుపడి ఉపమానము యొక్క యనుభవము కలిగినచో నది భ్రాంతి మంతము.

చూడంజూడ నృసింహకీర్తి వయమీ
 క్షోణీ నభో మధ్యమం
దేడం జూచిన దానయై నెగడగా
 నీక్షించి మిన్నేట నీ
రాడం బోయిన వేసి తాపసులు మే
 లౌ మ్రోలసిద్ధించెగా
నాడంబోయిన తీర్థమంచు మదిలో
 హర్షింతు రశ్రాంతమున్.'

నరసభూపాలుని కీర్తిఁ గని యాకాశగంగలో స్నానమాడబోవుచున్న సప్తర్షులు ఆకాశగంగ నే తలంచి హర్షమందిరి ఇట కీర్తి ఉపమేయము దానిని గాంచి హర్షమందుట ఉపమానానుభవము

వదన సరోజ వాసనకు
 వచ్చిన తేటి నదల్చి చూడగా
నది యసితోత్పలంబు లని
 యక్షుల వ్రాలఁగఁ జే విదుర్పగా
నది మరలం బయోజమని
 హస్తయుగంబున వ్రాల నవ్వె న
మ్మదవతి యేమి సేసినను
 మాన దిదేమియటంచు నెంతయున్.

ఒక యువతి తన ముఖ పరిమళమునకై వచ్చిన భ్రమరమును అదలించిచూచెను. ఆ తేటి ఆమె కన్నులు నల్లకలువ లని కన్నుల మీద వ్రాలినది. అపుడామె చేయి విదిలింపగా నది యా చేతిని తామరపూవని భ్రాంతిచెంది దానిపై వ్రాలినది. అంత నామె యేమిచేసినను మానదని నవ్వెను. ఇందుత్తరోత్తర భ్రాంతి నిబద్ధము.

రమాకాంతుడే భ్రాంతికి లోనైనపుడు పెరల సంగతి చెప్పనేల ? అయినను దేవతల సంగతి నరయుదు.

గగనముదాక చిత్రగత కాననములుగల మేడలు పర్వతము లనియు, వానిపై డోలాయమాన మగుచున్న మేఘములు నిండు సరోవరము లనియు, దేవతాస్త్రీలు భ్రాంతిచెంది జల విహారములు సేయవచ్చి యథార్థము నెఱింగి మరలి పోవుటను గాంచి ఆయా మాడువులందలి దంపతులు హసించుచుందురట

గగనముదాక చిత్రగత
 కానన సంహతిఁ బోల్చు హర్మ్యముల్
నగములు సాచి యూగిన ఘ
 నంబులఁ బూర్ణసరోవరంబులన్
వగ జలకేళిసల్ప నని
 వచ్చి యెఱింగి వియచ్చరాంగనల్
మగుడుట చూచి నవ్వుదురు
 మాడువులందు రమించుదంపతుల్.
(7-114)

ఇటుపై నరుల సంగతి నరయుదు
ఆటవికాంగనలు చెట్టు తొఱ్ఱలలోఁ బాముపడగను జూచి తేనెయని భ్రాంతి చెంది దానిని రాల్పబోయి నిక్కమెఱింగి పోవుచు దారిలో కాదపుష్పములను (ఇదివనపుష్ప విశేషము. వర్షఋతువున పుష్పించును) పరికించియు సర్ప భ్రాంతిచే వానిని చేర వెరతురు.

వరతరుకోటరాహిఫణి
 వర్గము తేనెలుసావితద్వనే
చరులవి రాఁపఁ బోవుచు భు
 జంగఫణావళిగా నెఱింగి చె
చ్చెరఁ బెడఁ బాసిపోవునెడఁ
 జెల్వగఁ బూచినకాదపువ్వుల
య్యొరుగమిడాయనోడుదు ర
 హిభ్రమశంక విభీతచిత్తలై (6-51)

చివఱప కించిత్ జ్ఞానవిశేషము గల మృగముల విషయమును బరికింపుడు.

ఓషధీపుర సౌధములఁ జెక్కఁబడిన కపోతములను గాంచి పిల్లులాశతో వానిపై కురికి అవి నిజమైనవి కావని యెఱిఁగియు, ఆ భ్రాంతిభావమున ఆపిల్లులు ఇతర కపోతములు పైమూగినను కదలకుండినవి. మాటలాడకుండినవి.

కమనీయాత్మక సర్వలోహమణి స
 త్కాష్ఠేష్టికానిర్మితో
త్తమహర్మ్యంబుల గండరించినకపో
 తవ్రాతిపంక్తుల్ బిడా
లములోలిన్ గనివానిమీద కలుకన్
 లంఘించి కాకున్నద
ద్భ్రమమైమూగినబల్కవొండెడ గడీ
 పారావతానీకముల్. (7-111)

శిల్పచిత్రవిద్యా నైపుణ్య రచనా పరమావధి సజీవరూపభ్రాంతి నొసఁగునట్లు రచించుటయే గదా! ఇట పారావతచిత్రములు పిల్లులకు సజీవ పారావతములవలె భ్రాంతి నొసఁగినవి

హరుని కోరిక ననుసరించి మునులు పార్వతిని చూచుటకై హిమవంతుని పట్టణమగు ఓషధీపురమును తిలకించినట్లు నన్నెచోడుడు వర్ణించినాడు. ఓషధీపుర మర్యాదలయందలి కేదారములలో పైరులకు కాపుండిన కామినీగణము చక్రవాక పక్షులను పారఁద్రోలుటకై చప్పట్లు చరువ చేతులెత్తగా వారి తుంగకుచముల సోయగమును గని చక్రవాకములు తమను వెడఁదోలిన చక్రవాకము లను భ్రాంతితో వానిని మెచ్చి చూచుచు కదలకుండెనట. స్త్రీపయోధరములను చక్రవాకములతోఁ బోల్చుట కవితాధర్మము. నన్నెచోడు డీవిషయమును ఇంచుకంత చమత్కరించి పాఠకుల మనములను రంజింప చేసినాడు

హాలిక నితంబినీతతి ప్ర
 యత్నమునం దమకాచియున్న య
క్కలమవనాళిఁ జక్ర విహ
 గంబులు సొచ్చినఁ జోపిపుచ్చఁ జే

తులు చఱువంగ నెత్తుటయు
తుంగకుచంబులు వాని నాగు న
ప్పూలుగుల యొప్పు దమ్ము వెడఁ
బోయిన పక్షము సేయునట్టిదై. (7-94)

అటులనే ఆ ప్రాంతమున విహరించు కీరములను పారఁద్రోలుటకై ఆ తరుణీ మండలి కేక పెట్టుచుండెను. వారి రసోదంచితమైన కంఠస్వరమునకు మాటల తీయందనమునకు మెచ్చి చొక్కిన ఆ (రా) చిలుకలు తమ్ము పిలుచుచున్నారనుభ్రాంతితో ఆరామలను చుట్టుముట్టినవట. ఆ మెలతల కంఠధ్వని చిలుక పలుకులవలె నాస్వాదయోగ్య మని చెప్పుటయే కవిరాజ శిఖామణి కమనీయాభిలాష

నలికమలాననల్ మృదు ని
నాదములన్ వెడఁదొక్కు పల్కులన్
సొలవక చిల్కలన్ వెడలఁ
ద్రోపునెలుంగులు తమ్ము డాయ దాఁ
బిలుచుటగాఁగ నాచిలుక
పిండనిశంబును చేలలోన మం
దలుగొని పాయకుండు మది
తద్వచన శ్రవణాభిలాషనై (7-95)

ఇట్టి భ్రాంతిమదలంకార సంశోభితమైన భావనాపరంపరలు కదనరంగమునను, కవితారంగమునను కాకలు దీరిన కృష్ణదేవరాయలనుగూడ నలరించి అనుకరింప చేసినవన్నచో ఆరచన ఎంతటిగంభీరమైనదో వేరుగనుడువవలసిన పని లేదు. ఆతని కృతియగు ఆముక్తమాల్యదలోని పద్యముల నిటస్మరించుట యనుచితమును గాదు. ఇరువురును రాజకవులగుట యొక విశేషము.

వేవిన మేడపై వలభి
వేణికజంటవహించి విప్పగా
పూవుల గోట మీటు తటిఁ
బోయెడు తేటుల మ్రోత కామిశం
కావహమాకృతాభ్యసన
లౌటను బంతపు పెట్లవెంబడిన్
జేవడివీణమీటుటయుఁ
జిక్కెడలించుటయున్ సరింబడన్. (1-62)

విలుబుత్తూరు పత్తనమున తెలవారగనే వారి యువతులు సౌధపువలభుల యందు కూర్చుండి వేణిని విప్పుకొనుచు నందలి విరులను కొనగోళ్లతో తొలగించునపుడు విరులపరిమళమునకై చేరిన ద్విరేఫములు పలాయన మునరించుచు చేసెడి రొద వీణానాదమువలెను, పువ్వులు దంతపు సరికట్టవలెను నుండెనట. ఆవారవనితలు వీణావాదనమందు గణన కెక్కిన వారు. చేతితో చిక్కునెడలించుకొనుట హస్తలాఘవముతో వీణమీటుట వలె దూరమున కగపడును. కావున నావీథి నేగు కాముకులు ఆయువతుల వాదనానైపుణి గుర్తెఱింగిన వారు గావున వెనుకటి భావనలచే ఆ తీరెల్లను వీణవాయించుట యని భ్రాంతిచెందుదురు.

ద్రవిడ కుటుంబినుల్ పసుపు
రాచిన రత్నపుదాపక్రింద నం
బువు తెరవారగా నిదుర
వోయిగరుత్తతిపచ్చబారినన్
భవన సరోమరాళములు
భర్మమయచ్ఛదగుచ్ఛవిస్ఫురత్
దివిజధునీమరాళవిత
తిభ్రమఁబూన్చుఁ బురిభ్రమించుచున్. (1-64)

ద్రావిడ రాజులు గృహారామములందలి కొలంకులలో జలకమాడుటకు రత్నమయమైన మెట్టుపై పసుపుకొమ్మునరుగ దీయఁగా ఆ పసుపునీరు మెట్టుక్రిందికి దిగియటనిద్రించుచున్న అంచుల రెక్కలపైబడ, రెక్కలపచ్ఛదనమునందిన ఆ హంసలు ఊరిలో సంచరించుచు పురజనులకు స్వర్గంగలోని బంగారు రెక్కల హంసలని భ్రాంతిని గలుగఁ జేసినవి.

తలపక్షచ్ఛట గ్రుచ్చిబాతువులు కే
దారంపుకుల్యాంతర
స్థలి నిద్రింపగఁ జూచియారెకులుప
స్నాతప్రయాత ద్విజా
వళిపిండీకృతశాటికల్ సవిఁదదా
వాసంబుఁ జేర్వంగరే
వులడిగ్గన్ వెసఁబాఱు వానిగని న
వ్వున్ శాలి గోప్యౌఘముల్. (1-65)

విలుబుత్తూరుమాగాణులలో వరిచేలకుఁబాఱు నీటికాలువల మధ్యభాగములందు ప్రాతఃకాలమునందు బాతువులు రెక్కలందల దూర్చుకొని నిద్రించుచుండగా ఊరికాపరులు వానిని గని అంతకుమున్ను స్నానముచేసి పోయిన బ్రాహ్మణుల వస్త్రపు పిడుచలని భ్రమించి వానిని వారికం జేర్చుటకై కొనిపోవనిచ్ఛగించి రేవున దిగగానే ఆసందడి కవి మేల్కాంచి ఆవలి కీదుకొని పోవందొడంగుట గని అచటి పైరుకాపుల కాంతలు నవ్వుదురు.

పైమూటిలో ఉత్తరోత్తరపద్యములు మేల్తరములు, మనోహరములు నని నా భావన.

కవిత్వకళ మానవజీవిత ప్రతిపాదనముగాన మానవమానసిక ప్రవృత్తి వివరణము గ్రంథమున ప్రముఖస్థానమునంగుండును. ఆహార్యమున కుచితమైన అభినయముండునట్లు బాహ్యాకారచిత్రణమునకనువైన మానసిక వ్యాపారవివరణమును కూడ కవి చూపినపుడే ఆకవితామూర్తికి గాంభీర్యము, సంపన్నత కలుగును. దానినే ఆలంకారికులు శిల్పమని చెప్పుదురు. ఈవిషయమున నన్నెచోడుని రచన ఎంత స్వాభావికముగ నున్నదో పరికింపుడు.

బ్రహ్మచారి వేషమున పార్వతిని పరీక్షించిన పిదప ఆమెను గూర్చి పరమేశ్వరుడుపడిన ఆరాట మీతీరున వర్ణింప బడినది.

హిమవంతు డింతి నాకీ దెచ్చు టెఱిగియు
నామాటలే నేల యాడనైతి
నత డొండునా నోడి యతివ నాకడనుంచి
యేగినకన్నెల యొఱుగనైతి

నాబాలనుఁ గూడ నాసించుచున్నచో,
మిన్నక తప మేల పన్నుకొంటి
తరుణీవలరసంబు దటిమి పైబడనున్న
నెఱనెఱింగి కూడ నేర నేల
బేలనైతిననుచు బాలేందు ధరుడాత్మ
చింతవిడచి విరహచింతఁ దగిలె
(6-160)

కొంద ఱిట పరమేశ్వరుని సామాన్య మానవునిగాఁ గవి చిత్రించినాడని యందురు గాని యది సరిగాదు. ఇది మఱో గ్రంథికి సంబంధించిన విషయము. అంగుననురాగమునకు నెలవైన దిది. మనసు ప్రధానవిషయ మైనప్పుడు ఆ చేష్టలకు, ఆమాటలకు, ఆ త్రిప్పులకు దేవమానవ తిర్యగ్భేద ముండదు ఈ పద్యమునందలి యెత్తుగీతియే పద్యమునకు జీవనాధారము. ఎత్తుగీతిలోని భావమే లేనిచో ఈపద్యమునకు జీవములేదు. సొగసుండదు. ఇంతటి 'వ్యగ్ర'మగు రచన గనుకనే ఈతని కవిత చరితార్థమైనది.

నన్నెచోడుని లోకజ్ఞతయు ప్రశంసనీయమే. కామకేళీలోలములైన కరికరేణువుల స్వభావ మెంత రమణీయముగ వర్ణింపబడినదో యొకపరి తిలకింపుడు.

బేటం బెటముగా నిభంబు కరిణిం
ప్రేమంబుతోఁ జేరి లా
లాటం బొత్తు లలాటపట్టమునఁ గే
లం గేలు వేష్టించుఁ గ్రీ
గోటన్ మే యొరయున్ వరాంగములు సో
కుం బుష్కరాగ్రంబునం
దాటోపం బొనరించుఁ గూడఁ బ్రియుఁగా
మాసక్తి నాసక్తమై. (1-100)

అనురాగముతో మగయేనుగు పిడియేనుగును చేరి ఫాలమును ఫాలముతోఁ జేర్చుటయు, తొండముతోఁ దొండమును చుట్టుటయు, క్రీగోటితో నొడల గీరుటయు కరాగ్రముతో వరాంగమును స్పృశించుటయు నెంత నిసర్గమధురములో! వలపుటలవుల కలవడనివి లేవుగదా! లోకమున కాముని ప్రేరణ బహుదుర్గమము గదా!

అటులనే సరసాహారము రాగహేతువు గాదని చూపిన ఉపమానములు కవికిఁగల తిర్యక్ జ్ఞానమును ప్రస్ఫుటీకరించుచున్నవి.

సరసాహారము రాగహేతు వను ట
జ్ఞానంబు పారావతో
త్కరముల్ సిక్కనిరాలు మ్రింగియును సదా
కామార్తులై యుండుఁ గే
సరిసాంద్రామిష భుక్తయైనను సకృత్
సంభోగమందున్ మనో
హర సుజ్ఞానమె కాక రాగరసమం
దాహార నిర్వృత్తియే. (12-220)

'సింహో మదద్విరద మస్తకమాంసభోజీ
సంవత్సరేణ కురుతే రతి మేకవారం
పారావతః ఖలుశిలాకణమాత్రభోజీ
కామీభవ త్యనుదినం వద కోఽత్ర
హేతుః'

పావురములు చిక్కనిరాలు భుజించునవియైనను ఎల్లవేళల కామార్తములైయుండును. ఇక కేసరి తుష్టిగా మాంసమును భుజించినప్పటికిని అరుదుగానే కామాసక్త మగును.

సర్వజ్ఞుడనుటకు యోగ్యమైన పాండిత్యముతోపాటు రచనా నైపుణ్యముగల వ్యక్తి ఆత్మవిశ్వాసము తనయందు తన కళయందు కుదురుపడగా పీఠికాభాగమునందే 'రవికుల శేఖరుండు కవిరాజ శిఖామణి కావ్యకర్త సత్కవి భువి నన్నెచోడుడ కై, కావ్యము... వినం గొనియాడఁ జాలదే' యని చెప్పుకొని తనవాక్కును చరితార్థత నందించుకొనినాడు.

ఇందు ప్రస్తావింపబడిన విషయములు చాల కొలదిమాత్రమే. ఓపిక, జిజ్ఞాస, కల వ్యక్తుల కీ కుమారసంభవ మొక పెన్నిధి. చదివినకొలఁది చవులూరింపచేసెడి మహనీయ కావ్య మీతనిది. అంతేకాదు. ఇహపరముల కీ కావ్య మొక భవ్యసోపానము.

---

# నవనవోన్మేషము

— శ్రీ తంగుడిగె శ్రీధరరావు,
బి. ఓ. ఎల్.

తృణకణమ్ము మీద మెఱయు
క్షణమాత్రపు నీటిబిందు
వొక నూతన విస్ఫూర్తికి
నురుతర చిహ్నంబె సుమ్మ.

క్రొక్కారున తొలి చినుకుఁ
జొక్కి పరవశించు కొండ
ఉచ్చతర ప్రకృతి నెడఁద
ఉన్మీలన మగుచునుండ.

నవ వికసిత హృత్సుమనో
నయన దళాంతర్దృక్కులం
సంపూర్ణత మెఱయు గొనును
సద్వాఙ్మయ పరిమళము.

ముండ్లనడుమ లేనగవుల
మూటగట్టు నొక గులాబి
భావగత స్ఫుటాకాంక్ష
పరమార్థం బెదియో కద!

# తెలుఁగులో కథాకావ్యములు

— శ్రీ కరెవరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.



( గత సంచిక తరువాయి )

అనువాదకావ్యములలో విలక్షణము, విశిష్టమునైనది పంచతంత్రము దీనికి తెలుఁగున అనువాదములు బహుధా వెలసినవి వీనిలో మొదటి అనువాద కవి నామము అజ్ఞాతము. ఈతఁడు క్రీ. శ. 1357 కి పూర్వుఁడు. మడికి సింగన తన 'సకలనీతి సమ్మత'మను సంకలన గ్రంథము (Anthology)లో పంచతంత్రములోని వని 189 పద్యాలను ఉదాహరించినాడు. ఉదాహృత పద్యము లాధారముగ పరిశీలించిన నీతని కవిత్వము సరళము, రస ప్రసన్నము, నని తోఁచును. చూడుడు.

"నమ్మిక చేసినవైనను
నమ్ముంగా వలవ దహితు నయమార్గజ్ఞుల్
నమ్ముం దె ననుచు వృత్తుఁడు
నమ్మికదాఁ బొలిసె నాక నాయకుచేతన్"
(3-980).

ఇక రెండవ యనువాదము దూబగుంట నారాయణునిది. క్రీ. శ. 1460-70)- పూసపాటి బసవరాజున కంకితము. మూలాను సరణమున మిగిలిన అనువాదములకన్న నిది మేల్తరము. "భావనా సంపుటి యందును, భావనా విస్ఫూర్తి యందును నెక్కువగ ప్రతిభా గాంభీర్యములు కన్పింపవు అయినను కవనధోరణి ఎచ్చటను రసవిహీనత నొందదు. నారాయణకవి గొప్ప పండితుఁడని చెప్పుటకు వీలులేదు.సామాన్య కవి యనియే భావింపదగును" అని శేషమళ్ళ అచ్యుతరావుగారు నుడివిన పలుకులు సత్యములు. ప్రౌఢత్వము లేకున్నను రసపుష్టి కలిగి చక్కని లోకోక్తులతోను, మృదువులైన తెలుఁగు పదములతోను నిండిన సరళ కావ్యము నారాయణకవి పంచతంత్రము. చూడు డాతని కవితాసారళ్యము.

"పెక్కండ్రు సుతులుఁ గలరవి
లెక్కించిన ఫలము గలదె లేశంబును బెం
పెక్కిన కులదీపకుఁడగు
నొక్కఁడె తనయుండు చాలు నుర్వర
మీఁదన్. (1-52)

పంచతంత్ర అనువాదములలో మూడవది తిప్పయగారి భానుకవిది. (క్రీ. శ. 1510-1530). ఈతఁడు కృష్ణదేవరాయల ఆశ్రితుఁడు. నాట్యాచార్యుఁడు బండారు లక్ష్మీనారాయణకు అంకితము. ఇతఁడు కావ్యంలో ఎచ్చట నీతులను చెప్పినను అవి కృతిపతి సంబుద్ధితో నుండుట విశేషము. మఱియు 'రాజకీరము-గణిక' అను కథను ప్రథమాశ్వాసములో మిత్ర భేదములో చెప్పుట గమనింపఁదగినది. ఇక నాలుగవ అనువాదము వైచరాజు వేంకటనాథునిది. (క్రీ. శ. 16వ శతాబ్ది) మిగిలిన పంచతంత్రముల కన్న దీనికి బహుళ ప్రచార ప్రశస్తులు లభించినవి. ఈతని కవిత ప్రౌఢము. మూలమును వేంకటనాథుఁడు తన అనన్య సామాన్య ప్రతిభతో ప్రపంచించి ప్రాబంధిక ధోరణిలో వర్ణనాబాహుళ్యముతో తీర్చిదిద్దినాఁడు" సమకాలిక జీవితాన్ని చిత్రిస్తున్నప్పుడు వేంకటనాథునికి మూపులు మూడవు తాయి. సామెతలు జాతీయాలూ వాడడం ఇతనికి నల్లేరు మీద బండినడక. వర్ణనలు చేయడం పెలపిండి. గడుసుపోకడలు పోవడం ఇష్టం. స్వీయప్రతిభను చూపడం అభిమతం" అని శ్రీ ఆరుద్ర ఉవాచ. ఇంతగా ప్రశంసలందుకొన్నను ఈతని కవితకు ముఖ్యలోపం 'వర్ణనలు కథాగతికి అడ్డుపడటం'. ఇది ఏత ద్వ్యగ ప్రభావము. సామాన్య విషయం చెప్పేటప్పుడు కూడ తన భాషాపాండిత్యం చూపటం వేంకటనాథుని లక్షణం. అందువలన ఆతని కావ్యము సామాన్య పాఠకులకు దురవగాహము. చూడుడు.

"నటన ననేక కాకప్రత
న ల్పతి వాసరము న్భజింప న
వ్వటమున మేఘవర్ణుఁడను
వాయస వల్లభుఁడుండు వానికు
త్కట భయకంపనంబు లెసఁ
గ న్నికట ప్రకటాటవీకుటీ
వటమున ఘూకసేన గొలం
వం బెనుగూబయుండు నుండు
నెప్పుడున్" (సం. 7ప).

ఇంతటి ప్రౌఢమయ్యును ఈ కావ్యము ఆదరము నొందుటకు కారణము ఆతని కథాకథన కౌశలము. మరియు సాంఘిక జీవిత చిత్రణమునను వేంకటకవి సమర్థుఁడు.

ఏవంవిధముగ సంస్కృత కథాకావ్యములకు తెలుఁగున వెలసిన అనువాద కథాకావ్యములలో పేర్కొనదగినది శ్రీనాథుని "శాలివాహన సప్తశతి". ప్రాకృత భాషయందు హాలునిచే సంకలనము చేయఁబడిన గ్రంథ మిది. గాథ యనునది ప్రాకృత ఛందము. ఈ గాథలు ముక్తక ప్రాయములు. ధ్వని ప్రధానములు. సంక్షిప్తములు, మధురభావ పరిపూర్ణములైన రసికోపనిషత్తులు గాథలు. "ఈ గాథలలో తడవని రసమయ వస్తువు ప్రకృతిలో లేదనియే యనవచ్చును. ప్రకృతిని మనోహరముగ, మధురముగ, ఉదాత్తముగ ఈ గాథలు వర్ణించినవి. గాథలలోని జానపదవర్ణనలు అమోఘములు. అసమానములు. సాహిత్యలక్షణ

శాస్త్రముల అవతరణమునకు గాథాకోశములోని గాథలే మూలకారణము"_ అని ఘట్టి లక్ష్మీనరసింహము గారు నుడివిన పలుకులు సత్యములు. శ్రీనాథుఁడు నూనూగు మీసాల నూత్నయౌవనమున దీని నాంధ్రీకరించినాఁడు. అది అనుపలబ్ధమగుట ఆంధ్రుల దురదృష్టము. అందలి ఒక్క పద్యము మాత్రము ఉపలబ్ధము.

"వారణసేయ దావగొన
వా నవవారిజమందుఁ దేఁటి క్రో
వ్వారుచు నుంట నీ వెఱుఁగ
వా_ ప్రియవా తెఱగంటి! గంటికె
వ్వారికిఁ గెంపురాగ_ తగ
వా మగవారల దూఱ నీ విభుం
డారని నీ నిజం బెఱుఁగు
నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ".
దీనికి ప్రాకృతమూలమిది.
"కస్సవణ హో ఇరసో
దట్ఠూణ పి అ ఇ సవ్వణం అహరం
సభమర పడమగ్ఘా ఇణి
వారి అవామే సహాసు ఏణ్హిం"

ఉపపతి చేసిన మోవిగాటును గృహపతి గమనించి నపుడేమి ప్రతిరదన మని తొట్రుపడుచున్న చెలితో_ వచ్చుచున్న ఆమె పతిని గాంచియు_ తెలియనిదానివలె నొకప్రౌఢ పలికిన పల్కులివి. తేఁటి దాగిన పూవును మూర్కొంటివి. తుమ్మెద పెదవి గుట్టి పోయినది గదా! నీ మగఁడు మంచివాఁడే యినను పెదవిపై తేఁటిగాటును జూచి యనుమానింపక మానఁడు, కోపింపక పోఁడు అప్పుడా బాధ సైచితివి. ఇప్పుడీ విభుని కోపమును సహింపుము". _ అని భావము. ఈ మాటలు విన్న గృహపతి సతిపై అనుమానము వీడి ఆదరించును సప్తశతి యందలి గాథలన్నియు ఇట్టి ధ్వని పూరితములే. కవిసార్వభౌముని కృతి లభింపక పోవుట ఆంధ్రసాహిత్యమునకు తీరని లోటు. "శ్రీనాథుఁడు నూనూగు మీసాల నూత్నయౌవనమున నుడివిన శాలివాహన సప్తశతి యనుపలబ్ధ మగుట రసికోపనిషద్రవ్యాస్తమయమే" అను డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి గారి పలుకులు ప్రత్యక్షరసత్యములు ఆధునికులలో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు గాథాసప్తశతిని చక్కని తేట తెలుఁగుతో ఆంధ్రీకరించి రసపిపాసులకు చుబ్బన చూఱలిచ్చినారు. గాథల యందలి సంక్షిప్తతను, ధ్వనిని చక్కగా పోషించిరి శ్రీ శర్మగారు

కథాకావ్యములలో ద్వితీయ విభాగము అనుసరణములు. కథాసరిత్సాగరాది సంస్కృత కథా కావ్యములందలి కథలను గ్రహించి నిజప్రతిభా కల్పనలచే స్వతంత్ర కావ్యములుగ దీర్చిదిద్దిన కవుల కావ్యములు ఈ కోవలోనికి వచ్చును. వీనిలో వెన్నెలకంటి అన్నమయ్య విరచిత 'షోడశ కుమారచరిత్రము' ప్రప్రథమమున పేర్కొనఁదగినది. దీనికి మూలము సంస్కృత మందలి కథాసరిత్సాగర, భేతాళపంచవింశతు లందలి కొన్ని కథలు. దశకుమార చరిత్ర ఒరవడిలో వ్రాయఁబడినట్టిది. ఇందు పదునాఱుగురు వీరులు సాహస యాత్రకు బయలుదేరి ఒక సాధకునకు సహాయము చేయబోయి విడిపోవుదురు. వారివారి అనుభములే ఈ కావ్యము. "కవిత్వము నిర్దుష్టమైనది. ఉభయభాషా ప్రౌఢి మెఱయుచున్నది. పద్యములు హృద్యములై ధారాశుద్ధి గలవిగానున్నవి" అని ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకాశకుల పీఠికావచనములు. పరస్పర విరుద్ధములగు ఉపమానములతో కథానాయిక సౌందర్యము సురుచిరముగ ఎలా వర్ణించినాఁడో చూడుఁడు.

'కరతలంబుల యొప్పు సరసిజంబులఁబోల
నెఱనందురునిఁ బోలె నెమ్మొగంబు
తనువు ఱూప్పుల యింపు దను గాలిమించిన
నవరోమరేఖ పన్నగము మించె
నలకలు తేఁటుల చెలువంబు గెలువ నా
సిక యొప్పు హేమపుష్పకము గెలిచె
ఘన కుచంబులు శైలగరిమంబు మీఱిన
రదన దీప్తులం వజ్రరశ్మి మీఱెఁ
గారణమ్ము లేక కడుఁ బరస్పర వైర
మయ్యె నొక్కమేనియందె యిప్పు
డా మెదముల కనుచు నతి చింతడస్సెనా
నడుము సన్నమయ్యె నళినముఖికి'.

ఈ గ్రంథము పూర్తిగా లభ్యముకా లేదు.

అనుసరణ కథాకావ్య కోటిలో ద్వితీయగ్రంథము జక్కన విక్రమార్కచరిత్ర. ఇది ఎనిమిది ఆశ్వాసాల గ్రంథము. కృతిపతి సిద్ధమంత్రి. లోకోత్తర గుణసంపన్నుఁడగు విక్రమార్కుని సాహసౌదార్య పరాక్రమాది గుణ స్ఫోరకము లగు కథలిందు వర్ణితములు. విక్రమార్కచక్రవర్తి చారిత్రక పురుషుడు. ఈతఁడు అతిలోక మహిమాన్వితుఁడు. ఇందు వర్ణింపఁబడినాఁడు. సంస్కృతమందు విక్రమార్కచరిత్ర మను కథాకావ్యమున్నను అది జక్కనకు పూర్తిగా మూలగ్రంథము కాదు అందలి కథాంశములు కొన్ని స్వల్పముగ జక్కన విక్రమార్క చరిత్రములో కన్పట్టినను, జక్కన ఎక్కువ కథాసరిత్సాగర, బృహత్కథలనే అనుసరించినాఁడు.

'చక్కన నీ వైదుష్యము
చక్కన నీ కావ్యరచన చాతుర్యంబుల్
చక్కన నీ వాగ్వైఖరి
చక్కన నీ వంశమహిమ జక్కన సుకవీ!
(2_23)

అని కృతిపతి జక్కనను ప్రశంసించినాఁడు. జక్కన కవితకు అక్షరాక్షర భాష్యమనఁదగిన వీ పంక్తులు. ప్రతి పద్యము చోద్యముగాఁ గృతి చెప్పిన (1_17) మనీషి జక్కన. 'జక్కన కవిత్వము ప్రౌఢమైనది. వర్ణనాంశములు పెక్కులు గలవు. స్వాభావికములైన వర్ణనల కంటె నుత్ప్రేక్షాదుల యందే యీ కవి కభిరుచి మెండు' అని చాగంటి శేషయ్యగారి యభిప్రాయము. అతని కవితా చమత్కృతి, ప్రౌఢిమ చూడుఁడు.

'తమ్మి లా కొమ్మ నెమ్మోముతమ్మిలనఁగ
బింబ మాయింతి కెమ్మోని బింబమనఁగ
జాతి యానాతి లేనవ్వు జాతి యనఁగ
రామయొప్పారు లోకాభిరామ యగుచు' (3-18)

ఇట్టిరచనే చేమకూరాది అర్వాచీనకవుల కాదర్శమైనది పై పద్యమందలి శ్లేష మనోహరము. ఈతని మృదుమధుర పద ప్రయోగ సరణికి నిదర్శనముగా నొక్క పద్యము.

'పసగల వెన్నెల మిసిమి పుక్కిటఁ బట్టి
పొసఁగఁ బిల్లల నోళ్ళఁ బోసిపోసి
నుగ్నని క్రియ్యన్క వెన్నెల తుంపరల్
హుమ్మని చెలులపై నుమిసియుమిసి
కమ్మని వెన్నెల కడుపునిండఁగఁ గ్రోలి
తెలివెక్కి గ్రక్కునఁ ద్రేన్చిత్రేన్చి
కన్నిచ్చలకువచ్చు వెన్నెల గ్రొన్నురు
వేటి వే ప్రియురాండ్ర కిచ్చియిచ్చి
తఱచు వెన్నెల గుంపులఁ దాటితేటి
యీఱమగు వెన్నెలలలోనఁ దూటితూటి
పలుచనగు వెన్నెలలలోనఁ బాటి పాటి
మెలఁగెఁ బెక్కు చకోరంపుఁ
బులుఁగు గములు' (6-71)

జక్కనకమనీయ భావుకతకు బావుటా ఈపద్యము. ఇంతటి మృదుమధుర కవిత కనుకనే 'జక్కన కవిత చక్కన' అను అభియుక్తోక్తి పుట్టినది.

మూడవది అనంతామాత్యుని భోజ రాజీయము. (క్రీ.శ. 1435 ప్రాంతము) ఈతఁడు జక్కనకు సమకాలికుఁడు. సంస్కృతమందలి ప్రసిద్ధిగన్న 'భోజచరిత్రము' నకు దీనికి సంబంధము లేదు. ఇది స్వతంత్రకావ్యము. భోజరాజీయమునందు ద్వితీయాశ్వాసము నందు మాత్రమే భోజ రాజజన్మ వృత్తాంతము గలదు. ఆతఁడు ధారానగరాధిపతి యయిన పిమ్మట సర్పటి యనునొక యౌషధ సిద్ధునిమోసగించి 'ధూమ వేది' యను రసవాద విద్యను గ్రహించి యతనిచే శపింపఁబడి యనంతర మతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడయి యాతనిని భోజనమునకు బిలుచును. ఇంత వఱకే భోజరాజీయమున భోజుని వృత్తాంతము. అప్పటున సిద్ధుఁడు తాను 'పంచ భిక్ష' వ్రతనియమము గలవాఁడ ననియు, కావున భోజునింట భుజింపజాలననియు తెలిపి, భోజరాజడుగఁగా అతనికి అన్నదానఫలము, పంచ భిక్షామాహాత్మ్యము తెలుపు కథలను చెప్పెను. ఇవియే భోజ చరిత్రమున ఐదాశ్వాసములలో విస్తరించినవి.

'సూత్రకథ భోజరాజ చ
రిత్రమ యానడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడి
యుండున్' (1-85)

అని అనంతామాత్యుఁడు నుడివినాఁడు. సూత్రప్రాయమగు భోజచరిత్రముతోపాటు నీతిబోధకములగు పదునేడు కథలు ఇందు గలవు 'జనసామాన్యమున ప్రచారము నందున్న ఆయా కథలను ఆధారముగా చేసికొని పురాణ కథల పోకడలను పోహళించుకొని స్వప్రతిభావశమున సంనిధానముల నేర్పఱచుకొని స్వతంత్రముగా రచించినట్టిదే ఈ భోజరాజీయ' మని కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులవారి పరిశీలనము. అనంతామాత్యుఁడు తన కృతి 'వివిధ కథా నూత్న రత్నభూషణాభిరామ' మని తెల్పినాఁడు. భోజరాజీయము 1) నూతనత్వము 2) పురాతన కృతిసామ్యము 3) ప్రశస్తకవితా ప్రసంగము 4) ధర్మోపదేశకత్వము 5) సజ్జన రంజకత్వము అను ఐదు లక్షణములతో నిండినది. (1-77) భోజరాజీయమందలి 'గోవ్యాఘ్రసంవాదము' బహుధాప్రసిద్ధి నొందిన ఘట్టము. అందు గోవు తన వత్సమునకు గఱపిననీతులు సార్వకాలికములు. సార్వజనీనములు. చూడుడు.

'ఆడకు మసత్యభాషలు
కూడకు గొఱగానివాని గొంకక యొరులె
గ్గాడిన నెదు రుత్తర మీఁ
గూడకు వినివినని వాని చొప్పునఁజనుమీ'
'చులుకన జలరుహతంతువు,
చులుకనత్రుణకణము,దూదిచుల్లనసుమ్మీ
యిల నెగయు ధూళి చుల్కన,
చులుకన మఱితల్లిలేని సుతుఁడుకుమారా!'

ఆదర్శప్రాయములగు నిట్టి నీత్యుపదేశములకు కాణాచి భోజరాజీయము. కేవలము ఈఒక్క కథేకాదు. ఇందలి ప్రతి కథ నీతులకు నిధి ధర్మములకుగని. మంచికి నిల్లు. అందువలననే భోజరాజీయము కథా కావ్యములలో ఉన్నతస్థాన మందినది చంద్రునిలో మచ్చలా ఇందొక లోపము గలదు. ఇందలి ఉపకథలు ప్రధాన కథాగతికి భంగము కలుగఁ జేయుచు పాఠకుల సహనమునే పరీక్షించును. అయితే అనంతామాత్యుని శైలీ లాలిత్యములో, కథానిర్వహణ నైపుణ్యములో ఈలోపము కప్పబడి పోవుటకన్పట్టును ఇంతటి మృగుమధురమగు సరళశైలి ఆంధ్ర కథా కావ్యములలో నాన్యతో దర్శనీయము.

తదుపరి కూచిరాజు ఎఱ్ఱన (క్రీ. శ. 1450-1500) కృత 'సకల నీతి కథా నిధానము' పేర్కొనఁదగినది. ఇది ఐదాశ్వాసాల గ్రంథము. శ్రీ తిరుపతి వేంకటేశ్వర నామాంకితము. నారదుఁడు బలి చక్రవర్తికి ఈకథలు చెప్పినట్లు ఎఱ్ఱన తన కావ్యాని కొక పౌరాణిక ప్రతిపత్తి కల్పించినాఁడు. ఇది బహువిధ కథాసంకలితము. ప్రథమాశ్వాసంలో విక్రమార్క చరిత్రయు, ద్వితీయాశ్వాసంలో భేతాళ పంచవింశతి యందలి కథలు, కేయూరబాహుచరిత్రమును, తృతీయాశ్వాసములో పంచతంత్రమును, చతుర్థాశ్వాసములో దశకుమార చరిత్ర యందలి ఉత్తమనీతి పద్యాలును, పంచమాశ్వాసములో కథా సరిత్సాగరమందలి కథలు కొన్ని చెప్పబడ్డవి. మొత్తంమీద నూటయేబది పైచిలుకు కథలు చెప్పాఁడు ఎఱ్ఱన. కవిత రసవంతమైనను కావ్యము

'కలగూరగంప' వలె రూపుదాల్చినది. పాఠకులను చదివించు గుణము కలది యీతని కవిత.

అయ్యలరాజు రామభద్రకవి విరచిత 'సకల కథాసారసంగ్రహము' అనుసరణ కథాకావ్యములలో చేరు మరియొకరచన. ఇది శ్రీకృష్ణదేవరాయల ఆజ్ఞపై వ్రాయఁబడిన గ్రంథము. కాని రాయలమరణము నాటికి ఇది పూర్తి కాలేదు. ఇది ప్రత్తేటి రామభద్రకవి కృతమని కొందరివాదన. గ్రంథము పూర్తిగా లభ్యము కాలేదు. దాదాపు తొమ్మిది యాశ్వాసముల గ్రంథము లభించినది. పూర్వకవి అనుసరణము చాల ఎక్కువగ కన్పట్టును. ఒక్కొక్కచో అల్లసాని పెద్దనాది సమకాలీనులను అనుకరించుట గమనార్హము. ఇందలి పద్యములు కొలది మార్పులతో రామాభ్యుదయమందు గన్పట్టుచున్నవి. రామాభ్యుదయమందలి ప్రసిద్ధమగు 'కానకకన్న సంతానము' అను పద్యము కొలదిమార్పుతో ఇట్లు కలదు.

'కానకకన్న సత్సూనుండు నేఁటికిఁ
గానక కన్న సత్సూనుఁ డయ్యెఁ
బుణ్యజనోత్కీర్ణ పురుషుండు నేఁటికఁ
బుణ్యజనోత్కీర్ణ పురుషుఁ డయ్యె
ద్విజసఖ్యులను గూడితిరుగు బాలుఁడు నేడు
ద్విజముఖ్యులను గూడి తిరుగుటయ్యె
గోత్రపావనుఁడైన కొమరుండు నేఁటికి
గోత్రపావనుఁడైన కొమరుఁడయ్యె
మత్తగజదాన ధారార్ద్ర మార్గములను
దరులనీడల నెప్పుడు దిరుగువాఁడు
మత్తగజ దాన ధారార్ద్ర మార్గములను
దరుల నీడల నెప్పుడు దిరుగుటయ్యె'

మొత్తముమీద 'సకల కథాసారసంగ్రహమందలి' కవిత యంతప్రశస్తము కాదు. రాసిలో చేరునదే కాని వాసిగలది కాదు పురాణప్రసిద్ధులగు రాజుల చక్రవర్తుల గాథలు వర్ణితములు. కథాకథనము.నందును. రచనా విధానమునంగును నవ్యత శూన్యము.

ఇక కథాకావ్య భేదములలో మూడవది కడపటిది. స్వతంత్ర రచనలు ఈ కోవకు జెందును. వీనిలో మొట్టమొదట పేర్కొనదగినది పింగళి సూరన (క్రీ. శ. 16 వ శతాబ్ది) కృతకళాపూర్ణోదయము. ఇది ఎనిమిది ఆశ్వాసాల కావ్యము. ఇది పింగళి సూరన అపూర్వసృష్టి. కల్పితేతివృత్తము 1) అత్యపూర్వకథా సంవిధాన వైచిత్రి 2) శృంగార ప్రాయత్వము. 3) పుణ్యవస్తువర్ణనీయత అను మూడు లక్షణములతో తన కావ్యం ఉంటుందని సూరన వక్కాణము. ఇందలి కథ అత్యంతాపూర్వము. అత్యద్భుతము. తత్సంవిధాన శిల్పముఅనన్యసామాన్యము. అంతేకాదు ఇందలి కథాకథనము కాలసరణికి (chronological order) చెందినది, ఆధునికమగు నవలయందును, నాటకము లందును, సినిమా లందును, ప్రసిద్ధినొందిన 'భావికా శిల్పము' (Flash-back technique) తో కూడినది. ఆంధ్రకథాకావ్య జగతిలో 'హిమాలయోత్తుంగ శృంగము' కళాపూర్ణోదయము.

స్వతంత్ర కథాకావ్యములలో తగువాత పేర్కొనఁదగినది పాలవేకరి కదరీపతి శుకసప్తతి. దీనినిగూర్చి సి.పి. బ్రౌన్ (C P. Brown) ఇట్లు నుడివినాడు. "Sukasaptati - A series of Telugu stories illustrating the various dialects of the Telugu Language .. This book 'The Seventy Tales of the Parrot' has the same title with the well-known Sanskrit composition of which, however it is not a translation but an imitation The work seems incomplete, the author not having finished the whole, it is perfect as for as it goes' - శుకసప్తతి పూర్తిగా లభ్యము కాలేదు. అసమగ్రమయ్యును తెలుఁగు కథాకావ్యములలో దీనికి సముచితస్థానము లేదు. సంస్కృతమందు ఇదే పేరుతో నొక గ్రంథమున్నను దాని కిది అనువాదము కాదు. అనుసరణమనియు చెప్పుటకు వీలు లేదు. ఇది శృంగారరస ప్రధానకావ్యము. నీచశృంగారమును ప్రబోధించునవి కథలు కథాకల్పనయందు అసమాన ప్రజ్ఞగలవాఁడు కదరీపతి. సామాన్యజనులనే పాత్రలుగ స్వీకరించినాఁడు. నాఁటి ఆంధ్రులజీవితమునకు ఆంధ్రసంఘమునకు దర్పణ మీ కావ్యము. ఇంతగా జాతీయత ప్రతిఫలించిన ఆంధ్రకావ్యము మఱియొకటి లేదనిన అతిశయోక్తి లేదు. పాత్రోచిత భాష, భావములు ప్రయోగించుటలోను, ప్రకటించుటలోను అద్వితీయుఁడు ఈ కవి. నాయికా సమాగమమును తలంచుకొను ఒక బ్రాహ్మణుని కవి ఎట్లు చిత్రించెనో చూడుడు.

'వలుదలై మెఱయు పార్వణపుముద్దలవంటి
వలిగుబ్బ లెన్నడు వ్రచ్చికొందు
బంచపల్లవముల మించిన, పెదవి యూఁ
కలి దీర నెన్నడు గఱచుకొందుఁ
గొనలుగల్గిన దర్భకోటి నేలిన కురు
ల్గట్టిగా నెన్నఁడు పట్టుకొందుఁ
బంచామృతముఁ గ్రిందపఱచు వాక్సుధ చవు
లనవంద నెన్నడు ద్రావికొందు
ననుచుఁ గోరుచు నవ్వుచు నాడికొనుచు
సారెగేరుచుఁ జూచినవారు వీని
పుట్టు కిష్కింధలోను గాఁబోలు ననఁగ
నాసుశర్మయు నాత్మగేహమున కరిగె'

ఆంధ్రసాహిత్యమున అపురూపమైన హాస్యరసమును సముచితముగ పోషించిన కవి తల్లజుఁడు కదరీపతి. ఇంగ్లీషు, మఖాములు, పరాసులు ఇత్యాది అన్యదేశీయములు ఇందు ప్రయుక్తములు. యథావదస్తువర్ణనము కావ్యమెల్లెడలగన్పట్టును.

సామెతలు, జాతీయములు ప్రయోగించుటలోను దక్షుఁడు కదరీపతి. సమష్టిపై శుకసప్తతి ధర్మప్రబోధకమయ్యును, ఆద్యంతము అవినీతి భూయిష్ఠమగు శృంగార కథలతో గూడినట్టిది. నాఁటి జాతీయ జీవనమునకు చక్కని ప్రతినిధి కనుక సాహిత్యములో దీని స్థానము సమున్నతము.

పాలవేకరి శుకసప్తతి కావ్యమాధారముగ వెలసిన మఱొక స్వతంత్ర కథాకావ్యము అయ్యలరాజు నారాయణామాత్యుని 'హంసవింశతి', (క్రీ. శ. 17 వ శతాబ్ది). ఇది ఐదాశ్వాసముల శృంగార రసప్రధానమగు కావ్యము. హేమావతి యను వనిత భర్తలేని సమయమున తత్పుర రాజును కలియుటకు పోవునపుడు 'ఆంకు నేర్చినమ్మ బొంకు నేర్వవలె నని' పెంపుడు హంస ప్రతిరాత్రి తెల్లవారువరకు రాత్రికొక కథచొప్పున చెప్పిన ఇరువది కథలసంపుటి ఈ గ్రంథము. ఇరువదియొకటవనాఁడు హేమావతి భర్త తిరిగి వచ్చును. హేమావతి మనసుమారి భర్తతో సుఖముగా కాపురము సేయును. కాగా ఇందలి కథలన్నియు శుకసప్తతిలో వలెనే దుర్నీతి బోధకములు. అయితే ఈగ్రంథవైశిష్ట్యమునకు కారణము నారాయణామాత్యుని సర్వజ్ఞత్వము. హంసవింశతి నాతఁడొక విజ్ఞాన సర్వస్వము (Encyclopedia) గా తీర్చిదిద్దినాఁడు దీనిని చదువుట వలన పాఠకులకు వైద్య, జ్యోతిష, సంగీత, ఆధ్యాత్మిక, యోగాది బహువిధశాస్త్ర పరిచయము కలుగును. సజీవములగు అనేక పాత్రలతోడి పరిచయ మేర్పడును. సాతాని, బ్రాహ్మణ, నాయక, వైశ్య, కాపు, గొల్ల ఇత్యాది బహువిధ జనులు హంసవింశతిలో కన్పట్టుదురు. ఆయాకథలలో వారి వారి ఆచారవ్యవహారములు, వేషభాషలు, సంప్రదాయములు, గృహ నిర్మాణపద్ధతి, గృహోపకరణములు ఒక టేమిటి సమస్తము ఊచముట్టుగ వర్ణించి పాఠకుని విజ్ఞానవంతునిగ చేయ యత్నించును. ఈతఁడు నాయికా వర్ణనము కథలో ఇరువదియొక్క పర్యాయములు చేసినను ప్రతిసారి యొక నవ్యత చూపుట ఈతని ప్రతిభకు, భావుకతకు నిదర్శనము. అలతి యలతి పదాలతో సుకుమార భావయుతముగ వర్ణించుట ఈతని పద్ధతి.

'వక్రయానంబుతో నాగచక్ర కుచలు
నిలువుఁగన్నులతో దేవ నీలకచలు
నాతిమృదుగతి చపలేక్షణముల కలికి
క్రిందు మీఁదైరి గాదె! పూర్ణేందువదన'
(2-14)

భూలోకమునకు పైనిగల స్వర్గలోకమున దేవతలుండుటకు, భూలోకమునకు అధోభాగమునగల పాతాళమున నాగులుండుటకు కారణము చక్కని జాతీయముతో చమత్కారముగ సూచితము. కాగా నారాయణామాత్యుని కావ్యము ప్రతిపద్యరామణీయకముతో, ప్రతిపద్య చమత్కారముతో, అపూర్వ కథాకల్పన చతురిమతో, నిండియుండుటచే సహృదయ రసజ్ఞ రసాయనమైనది. 17 వ శతాబ్ది జాతీయజీవమునకు ప్రతినిధిహంసవింశతి. నీతిబోధ దృష్ట్యా ఈకావ్యము యొక్క స్థానమును ఆలోచింపఁదగినదే.

'విశ్వశ్రేయః కావ్యమ్మను'నునది భారతీయ సాహిత్య స్వభావ జీవలక్షణము 'శివేతరక్షతయే' అనునది ఒక కావ్య ప్రయోజనముగ మమ్మటుఁడు పేర్కొనినాఁడు. శుకసప్తతి, హంసవింశతుల కథలు ఆద్యంతము అవినీతి బోధకములే. ఫలశ్రుతిలో నీతి బోధ యుండును. ఉద్దేశము మంచిదైనను చేరు విధానము మంచిది కాదు. 'The office of Poetry is not normal instruction, but moral emulation, not doctrine but inspiration' అను జి. హెచ్. లూయీస్ G H (Lewis) పలుకులిట అనుసంధేయములు. కావ్యములు మనుధర్మశాస్త్రాదుల వలె నీతిబోధకు బలాత్కారముగ పూనుకొనక పోయినను అవినీతిని బోధింపరాదు. నీతిబాహ్యములగు కావ్యములు సమాజ శ్రేయస్సుకు భంగకరములు. ఇట్టికావ్యములు 'కళ కళకొఱకే' (Art for Arts sake) అను సిద్ధాంతమునకు నిదర్శనభూతములు. అయితే జాతీయజీవనమును ప్రతిబింబించుటలో ఉత్తమోత్తమములు గనుక ఆ దృష్ట్యా ఇవి ఆదరణీయములు.

స్వతంత్ర కథాకావ్యములలో చివరగా పేర్కొనఁదగినది కువలయాశ్వ చరిత్ర. ఇది కళాపూర్ణోదయమునకు మానసపుత్రిక. చెంజి (జింజి) దుర్గాధిపతియగు సవరము చిన నారాయణ రాజకృతము. అద్భుతరస ప్రసన్నమగు కావ్యము. ఋతుధ్వజుఁడు మదాలసను వివాహమాడుట ప్రధానేతివృత్తము. కథాకథనము కళాపూర్ణోదయపు బాణీలో సాగినది.

మొత్తము మీఁద పురాణ, ప్రబంధ, రూపక ప్రక్రియలతో సమస్కంధమైనది కథాకావ్యప్రక్రియ. ఆంధ్రవాఙ్మయ లక్ష్మికి అనంత తేజో విరాజమానమగు సురుచిర ఆభరణము 'కథాకావ్య ప్రక్రియ.'

# సుఖసేవధి

— శ్రీ చల్లా నరసింహారావు.

కాటిలోన నరుఁడు కాలిన బూడిద
మెరక యౌచు నిచటె మెదలకున్న
మరల జన్మమెట్లు మానవునకుఁ గల్గు
చావుతోనె జనుని సకల మణఁగు

దొరకిన యంతనే ఋణము
తొందర పోవుచుఁ దీసికొమ్ము యెం
దఱికడ నైనఁగాని; యిఁక
దానిని కోడిపులావు కోసమున్
సురకును ఖర్చుపెట్టు; వెను
జూడకు; సొమ్మును దీర్చుటందువా
మఱి తరువాత దానిపని;
మ్రాన్పడఁబోకుము జీవితమ్మునన్.

పేదలు చెట్టుక్రిందఁ జలి
పెట్టి క్షుధార్తిని మున్క నీశ్వరుం
డాదటతోడ 'గర్భగుడి'
యందున వెచ్చననుండి దీవనల్
బాదలు వోవనిచ్చునఁట;
బండను జేరుటకన్న నాతఁడే
పేదలఁ జేర వెచ్చరయు ని
వేదనముల్ మఱివారి కందవే!

హేమంతంబు సితావగుంఠనముతో
నేతెంచెఁ బూదాదులన్
సామోహంబుగఁ గర్భరోల్లసము నా
స్వాంతమ్ము మూసెన్ చెలీ
నీమైపై లలికైత వ్రాసి వలిప
న్నీరట్లు చిల్కించు; ని
త్యామోదమ్మున నీవెపాడు మృదుహ
ద్యమ్ముల్ దుషారమ్ములన్.

చెలిగల దేని సన్నిధినిఁ
జేతము సంతస మొంది నిత్యమున్
వెలుఁగుచునుండు; సృష్టి మనఁ
బెట్టిన జీవవరంబయద్ది; లో
పల భ్రమయున్న సాగనియ
భాగ్యముముక్తులు పల్కుచుంద్రు ము
గ్ధలదరిఁ జేరఁ బోకుఁ డని;
దానిని నమ్మిన మోసపోవుటే.

కష్టము వచ్చునంచుఁ గల
కన్‌బడి చూచెడి దానికన్న; నా
కష్టము వచ్చినన్ సులువు
గాఁగనిపించు రివాజు జీవికన్
స్పష్టమటంచు తోచును; ని
కాసమయమ్మున దీపమారినన్
కష్టముఁ లేకయే కనగ
గల్గుట రూఢియకాదె యేరికిన్.

నీవును నేను నీతరుల
నీడల రాలిన పూలబాటలన్
దావులు కాళ్ళఁ జిక్కకొన
దాటుచుఁబోవుద మింక పైదలీ
జీవిత మూల సౌఖ్యమును
జేరుచు సొమ్మసిలంగ; లోకులే
వేవిధి యాడు కొంద్రు; మన
కేమిఁ?, హాసమ్మున ముంచు కాలమున్.

నినుఁగను గొన్న నామదిని
నీరవ రాగ వరాలి స — —
హానముగ దొర్లి నిల్చె; కల
మందెద; మవ్వపుకైతలోన నా
హాను వెలిగించి దానికిడ;
నన్యులు కంటికిఁ గానరాని యా
మనివని మధ్య నిర్భరము
మానిని చూతము పాట యర్థమున్.

(బృహస్పతి ప్రణీతమని చెప్పబడు 'చార్వాకదర్శనము' ననుసరించిన నా తెలుగు కావ్యమునుండి)

# తెలుగులోని పదములు - పూర్వోత్తరములు

— శ్రీ మ. సుబ్రహ్మణ్యశర్మ.



ద్రావిడభాషల తీరువేఱు తెలుగు భాష తీరువేఱు. ఇందు అనేక సంస్కృత పదములు తత్సమాదిరీతులలో మిశ్రమమగుటయే దీనికి కారణము. కొన్ని సంస్కృత పదములు తెలుగుభాషలో ఏ యర్థమున ప్రవేశించినవో ఆయర్థమునకు కొలదిభిన్నముగా తెలుగున వ్యవహరింపఁబడుట గమనింప వచ్చును.

బద్ధకము, అబద్ధము అనునవి యిట్టివే. మొదటిది సోమరితనమునకు, రెండవది అసత్యమునకు మాఱుగా వ్యవహరింపఁబడుచున్నవి. వీనికి వ్యుత్పత్త్యర్థముల నిట్లు చెప్పవచ్చును.

బధ్నాతి ధాతువునకు క్తాంతరూపము బద్ధ అగును. బద్ధ శబ్దమునకు కట్టబడినవాడు (అది) అనునర్థము కాఁగలదు. సోమరియు బద్ధుఁడును పనిచేయమి సమానులు కావున సోమరి యనునర్థమున బద్ధశబ్దము కప్రత్యయాంతముగా వ్యవహృతమై బద్ధకశబ్దము సోమరియను నర్థము నిచ్చుచున్నది. కాని బద్ధక శబ్దమునకు సోమరియను నర్థము కాని సోమరితనము కాఁజాలదు. సోమరితనము అనునర్థమున బద్ధకత్వము, బాద్ధక్యము అనురీతులుగా పదముల నుపయోగింపవలెను. కాని బద్ధక శబ్దము సోమరితనము అను నర్థముననె వ్యవహరింపఁబడుచున్నది. దీని నిట్లు సమర్థింప వచ్చును.

తెలుగున ధర్మివాచకములు, ధర్మవాచకములు అని రెండు కలవు. అనఁగా పగ అను శబ్దమునకు శత్రువు అను నర్థముండగా నేడు శత్రుత్వమను నర్థము కల్గినది. శత్రువు అనఁగా శత్రుత్వము కలవాడగుటచే (శత్రుత్వము అనుధర్మము కల్గినవాడగుటవలన) పగశబ్దము శత్రువాచియైనపుఁడు ధర్మివాచకమగును. శత్రుత్వమను నర్థము చెప్పిన అది ధర్మవాచక మగును. ఇట్లు ధర్మివాచకము ధర్మవాచకముగా మారుట తెనుగుతనము. వింద మొదలగు పదము లిట్టివే బద్ధకశబ్దమునుకూడ (ధర్మి వాచకమును) ధర్మ వాచకముగా వ్యవహరింపవచ్చును. దీనికి తిక్కనగారి ప్రయోగము సహాయము చేయుచున్నది.

"అనుటయు నాతడు హరికి
ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్"

ఉద్యో॥ ప్ర॥ 36 ప.

సహాయ అనగా తోడైనవాఁడు ఇది నేడు ధర్మవాచకమై తోడగుట అను నర్థము నిచ్చుచున్నది. కావున బద్ధకము అనగా సోమరితన మను నర్థము చెప్పవచ్చును.

బద్ధము అనగా ఛందోబద్ధము ఇత్యాదులందు ఛందస్సుచే కట్టబడినది అను నర్థమున ఛందస్సునకు సంబంధించినది అను భావము నిచ్చుచున్నది. అనగా జరిగిన విషయమునకు చెప్పిన విషయము కట్టబడలేదు. అనునర్థమున వ్యతిరేకము అబద్ధమై వ్యవహారబలమున అసత్యవాచియైనది

తేపు అనునదికూడ అర్థమున మార్పు పొందినది. తేగు అను ధాతువునకు విజృంభించు అని యర్థము. సూర్యుఁడు విజృంభించు సమయమునకు ప్రాతఃకాలమునకు పర్యాయముగా తేపు అను కృద్రూపము ఏర్పడినది.

ప్రాతఃకాలార్థమున — తేపు అను దానికి అప్పుర బాహ్యోపవనాంత దీర్ఘికల తేపున్ మాపు వీతెంచు అని శ్రీనాథుని శివరాత్రి॥ లో ప్రయోగము ఉదాహరణగా కలదు.

ఈ తేపు శబ్దము నేడు నేటి తరువాతి దినము అను నర్థమున వ్యవహరింపఁబడుచున్నది. ఇట్టియర్థమునకు కారణము నిట్లు చెప్పవచ్చును.

పూర్వికులు పూర్వాచారపరాయణులు ఇంటికేతెంచిన వారిని నడచి వెళ్ళుట వలన ఆలస్యమయి రాత్రియైననిబ్బందిబడుదురను భావముతో నేటికుండి తేపు వెళ్ళుదురుగాక అనుట పరిపాటి. ఇట్టి విధముగా తేపు శబ్దము వ్యవహరింపబడి తేపు వెళ్ళుఁడు అనగా నేటి తరువాతి దినము అను నర్థమున రూఢమైనది.

ఇట్టి పదములనేకములు తెలుగు భాషలో కలవు. భాషాశాస్త్రజ్ఞులు వీనినే లక్ష్యార్థములు అని యందురు. ఇట్టి అనేక పదములయొక్క విజ్ఞానము నెఱుంగుట మన కర్తవ్యము.



# హెచ్చరిక

— శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.



స్వార్థరహిత పరార్థ జీవనుల పుణ్య
నిలయమైన భారతమున నీవు పుట్టి
సిగ్గు లజ్జయు లేక యిపీ ! గడించితె
కరడు గట్టిన యా స్వార్థపరత మిత్ర !

అలఘు సత్యహరిశ్చంద్ర విలసితమగు
భరతభూమిని జనియించు భాగ్యముఁ గని
యెడ తెఱపిలేక పలుకుదువే సఖుండ !
తగ నసత్యముపై నసత్యములు కోటి.

చారు దివ్యశృంగార ప్రసార నిలయ
భక్తి పరిణతినందిన భారతమున
జననమందిన నీవె నిషాదభంగి
నీచ రసహీన శృంగార నిధి వగుదువె ?

పరమ సుందర కవితా ప్రభావమునను
దివ్యతం గన్న పూజ్యుల దేశమందె
జననమంది వామాచార సరణి స్వేచ్ఛఁ
బాడుకైతలు వ్రాయంగఁ బాలుపడుదె ?

ధర్మమునకై సమస్తంబు ధారపోసి
శాశ్వత యశంబు నిలిపిన సరసమతుల
దేశమునఁ బుట్టి ధర్మమ్ము దీనదశకుఁ
దెచ్చి నశియింతువె యధర్మ దీక్షఁబూని.

కలదు పాపంబు పుణ్యంబు కలవు స్వర్గ
నరకములు స్వేచ్ఛ అంధానుకరణమునను
సంప్రదాయ నిరాకృతి జరపు వెడల
నేమి యాదువో పిదప నూహింపు మిత్ర !

—0—

# కవి స్వగతము

— శ్రీ డి. వి. మురళీమోహనాచార్య



కవి సమ్మేళన మన విని
కవితల నీక నేనుగూడ ఘనముగ వ్రాయం
గవలయు ననుచును దలఁచితి;
కవిగాని పురుషుఁ డెవఁ డిల కనరాఁడుగదా !

గణములన్నిటిఁ గూర్చి నే కంద మొకటి
వ్రాయఁగాఁ బూన యతియును ప్రాస వోయె
గీతమైనను వ్రాయ కాగితముఁ గొనఁగ
కలము సాగక కలిగెను కలవరంబు

ఆటవెలఁదిని గూర్పఁగా యత్న మెంతొ
సలిపినను గాని గంటమ్ము సాగకుండె;
సీసముల కోసమై నేను జేయు యత్న
మెల్ల నిష్ఫలం బగునంత తెల్లవారె.

ఛందమున వ్రాయుటన నెంతొ జటిలమనుచు;
లలితగీతాలు వ్రాయ, విలాసమందు
నించుకైనను గనిపింపఁ డేమిసేతు
నంచు వచనకై తల వ్రాయ నాశపడితి.

అన్న మాట పదే పదే యనఁగవచ్చు
గణముఁ బ్రాసయు యతుల సంగతులు లేవు
భావ మున్నను లేకున్న బాధలేదు -
ఎవరు విన్నను వినకున్న నేడ్వబోను.

ఇన్ని బాధలవేళ నాకన్న వినుడు -
ఎట్టు లేనియు నేడు నేపట్టుపట్టి
కవుల సరసన గూర్చుండి కందువాను
గప్పుకొనవలె సభ నను కాంక్షగలదు.

—0—

# చమత్కారమంజరి

— సేకరణ రత్నశ్రీ (యస్ రాజశేఖర్, బి ఏ)

చమత్కారంగా మాట్లాడడం ఒక కళ అలా మాట్లాడ్డం అందరికీ సాధ్యపడదు దానికి మంచి సమయస్ఫూర్తి, వాగ్ధాటి ఉండాలి కవులైన వారందరూ మహావక్తలు కాలేరు కవిత్వం వేరు, వక్తృత్వం వేరు సాధారణంగా కవులకు కవిత్వంతోపాటు వ్యక్తృత్వం ఉంటుంది హాస్యం అనేక రకాలుగా జనిస్తుంది కొంతమంది మాట్లాడే తీరులో, కొంతమంది నడిచేనడకలో, ఈ హాస్యం ఉద్భవిస్తుంది ప్రతీవారుచమత్కారంగా మాట్లాడలేరనేది నిర్వివాదాంశము కొన్నిసందార్భాల్లో కొందరి అమాయికత్వంనవ్వురప్పిస్తుంది హాస్యాన్ని మానసిక రోగాలను, పోగొట్టేమందులా ఉపయోగించాలి, తప్ప ఆహారంలా తీసుకోరాదు ఉత్తమహాస్యం నవ్వించడంతోపాటు ఒకబొట్టు కన్నీటినికూడా చిందిస్తుంది హాస్యం కొందరిమాటల్లో ఎప్పుడూ లాస్యంచేస్తుంది ఈ చమత్కారాన్ని భోజరాజుకాలం నుంచి ఇప్పటి వరకు మీకు అందించడానికి ఈ వ్యాసాన్ని వ్రాసాను నేను లోగడ 16-6-78సంచికలో 'చమత్కారమంజరి' పేరుతో కొన్ని ఛలోక్తులు, చమత్కారాలు అందించాను మరికొన్ని ఇప్పుడు అందించబోతున్నాను

భోజరాజు కాలంలో కవిత్వంరాని వారు లేరు అంటే అతిశయోక్తి లేదు కూలిపని చేసుకొనే సాధారణ మానవుడి నుంచి సరససాహితీసమ్రాట్ భోజరాజు వరకు అందరూ కవులే అసలు భోజరాజుని చూస్తేనే చాలుట కవిత్వంవచ్చేదిట దానికి అనేకకథ లున్నాయి కుమ్మరి, కంసాలీ, అందరూ కవితా నిర్మాతలే భోజరాజుకాలంలో కవులకులోటు లేదు మేధానిధి, చమత్కారధురి అయిన కాళిదాసు ఆ కాలంలో వాడే కాళిదాసు దైవాంశసంభూతుడు కవిత్వం అతనికి వరప్రసాదం ఒకసారి భోజరాజు ఆస్థానమునకు ఇద్దరు వైదికులువచ్చి, భోజరాజుని ఆశీర్వదించుట చేతగాక, తికమకపడుతూ ఈ క్రింది వాక్యములు ఒక్కొక్కరు ఒక్కొక్కవాక్యం చదివారు

1 అణోరణీయాన్ మహతో మహీయాన్

2 యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్

కాళిదాసు ఆసమయమునకు అక్కడికి రాగా, భోజరాజు 'కాళిదాసా!' ఈ రెండిటికి (వాక్యాలకి) సమన్వయం చెప్పుమని అడిగెను వెంటనే కాళిదాసు ఆశువుగా ఒకశ్లోకము చదివెను.

శ్లో॥ అణోరణీయా న్మహతోమహీయాన్
మధ్యో నితంబ శ్చయ దంగ నాయాః
తదంగ నాలింగనకుంకు మార్ద్రం
యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్

దాని అర్థమేమిటంటే "అణువుకన్న చిన్నదైన నడుము, పర్వతాదుల కన్న పెద్దపిరుదుల గలయువతిని, ఆలింగనము చేసినాడొక యువకుడు ఆమె స్తనములకుఁ బూసికొనిన కుంకుమ, యాతని యజ్ఞోపవీతమున కంటుకొని, అది ఎఱ్ఱపడి, మిగులపవిత్రమైంది" అతని చమత్కారానికి, ఆశుకవితా ప్రావీణ్యానికి భోజరాజు ఆశ్చర్యపోయాడు వెంటనే కాళిదాసుని సన్మానించాడు కాళిదాసు భార్యకూడా కవయిత్రి ఒకసారి ఒక సమస్య ఇచ్చి కాళిదాసుని పూరించమని కోరింది.

సమస్య.
కుసుమే కుసు మోత్పత్తిః
శ్రూయతే న హి దృశ్యతే

అంటే 'పూవులోపూవు పుట్టినట్లు వినుచున్నాముగాని, చూడలేదు. దానికి కాళిదాసు సమాధానం వినండి

శ్లో॥ 'బాలేతవ ముఖాంభోజే
దృష్ట మిందీవరద్వయమ్

అనగా, ఓ, బాలికా! నీ ముఖపద్మమున రెండు (కన్నులు) కలువపూవులు కలవు ఇది ద్విపాదసమస్య భోజుడు ఒకసారి కాళిదాసుకు త్రిపాదసమస్య యొక టిచ్చి పూరింపు మనికోరెను

సమస్య
దివా కాకరుతాద్భీతా,
రాత్రౌ తరతి నర్మదామ్
తత్రసంతి జలే గ్రాహాః

కాళిదాసు వెంటనే 'మర్మజ్ఞా సైవ సుందరీ! అని పూరించెను దీనిభావ మేమిటంటే పగలు కాకికూతకు భయపడిన కాంత రాత్రి మొసళ్ళుగల నర్మదానదిని దాటుచున్నది' అని భోజరాజు ఇచ్చాడు 'ఆమె కా మాయ తెలియును'అని పూరించాడు భోజరాజు కాలంలో తాను ఏది చూసినా ఆదృశ్యము ఒక పద్యంగా రూపు దాల్చేది ఏసంభాషణ విన్నా అదొకసమస్యగా మారి, రసజ్ఞుల మెదళ్ళకు, మేత అయేది.

ఒకనాడు భోజరాజు పురవీధిని విలాసార్థము వెళ్ళుచుండగా అచ్చట నొక వేశ్య ఒక బంతినిబట్టి ఆడుకొనుచున్నది, ఆ బంతిని నేలపై కొట్టుచున్నది అది మాటిమాటికి ఆమె పాదాగ్రములపై నుండి ఎగిరిఎగిరి పడుతోంది అదిచూసి భోజరాజు రసస్పందన చెంది, తన సభాస్థలి కరిగి పండితులలో మహాశయులార! మీరు సుందరి ఆడుతున్న బంతి ఆటను చూచితిరికదా! ఆదృశ్యమును వర్ణింపుడు అని వచించెను దానిని మొదట భవభూతి ఇట్లు వర్ణించెను. (స్థలాభావంవల్ల

శ్లోకములు వ్రాయుటలేదు.) దాని తాత్పర్య మేమిటంటే 'ఓ, బంతీ! నీ యభిప్రాయము నాకు తెల్సినది. ఆ సుందరి యొక్క కెమ్మోవి ముద్దుగొనుటకై కదా నీవు మాటిమాటికి ఆమెనిన్ను చేతితో మోదినను, క్రిందపడిమరల నెగయుచున్నావు!!' తరువాత 'వరరుచి' వర్ణించెను. 'ఆవిలాసవతి చేత చఱచినపుడు ఆమె అరచేతిరక్తముచే ఎర్రగను, క్రిందపడి ఆ యువతి గోళ్ళవెలుగుచే తెల్లతెల్లగను పైకెగసి ఆహరిణాక్షి కన్నుల కాంతులచే నల్లనల్లగను వెలుంగుచు ఆబంతి చూపరులకు మూడుబంతులవలె గన్పట్టుచున్నది. తర్వాత కాళిదాసు.' ఆ యువతి తన పాలిండ్లవలె నున్న ఆ బంతిని మాటిమాటికి రోషమున కొట్టుచున్నది. ఇక నామె కన్నుల, యాకారము దాల్చియున్న నాకు మాత్ర మిట్టి శిక్షగలుగక యుండునా ? అనిభయమొంది యామె చెవికొననున్న కలువపూవురెండు కాళ్ళపై బడిఁ యావిలాసవతి యొక్క దయారసము గోరుచున్నదో యనునట్లు తటాలుననామె పాదములపై బడుచున్నది. అనవిని భోజుడు ముగ్వురుపండితులను సత్కరించెను. కాళిదాసు చమత్కారము నకు మిగుల సంతసించి, గొప్పబహుమతి నిచ్చెను.

ఒకసారి కాళిదాసు, మహాపండితుడనని విర్రవీగుతున్న ఒక పండితుని ఇలా ప్రశ్నించాడు. అయ్యా 'కాకులుఅన్నియు చేరి సదా కావుకావు మని కూయును గదా ! వాని అభిప్రాయ మేమి ?' ఆ ప్రశ్నకు పండితుడు తికమకపడి ఓరీ! ఇట్టి అవకతవక ప్రశ్న లడుగుదువా?! ప్రశ్నము లడుగక నోరుమూసుకో! అని మండిపడెను. వెంటనే కాళిదాసు. అయ్యా! మహాపండితులు మీకీ చిన్న విషయమే తెలియదా ? వినండి చెప్తాను 'కాకులు కావు కావు మనుట యేలనన సూర్యుఁడు కటిక చీకటిని సంహరించు చున్నాడు. కావున చీకటివంటి నల్లనిరంగు గల మమ్ములను కూడ సంహరించునేమో అను భయమున అట్లుకూయుచున్నవి.' అనెను.

ఒకప్పుడు భోజరాజు విహారార్థం ఊరి బయటకు వచ్చి అచ్చటి విశేషములు తెలుసుకొనుచుండెను. ఆప్రదేశంలో ఒక చాకలి బీ, బీ, బీ, యని మాటిమాటికి ధ్వనిచేయుచు బట్టలుతుకు చుండెను. అది విని భోజరాజు సభలో అదొక సమస్యగా నిర్మించి పూరించ మనెను.

సమస్య :- బీ బీ బి బీ బి బి బీ బిః

శ్లో. మధ్యాహ్న కాలేమలినాంబరాణాం
ప్రక్షాళనార్థం రజకః కరాభ్యాం
పాషాణఘాతేన కరోతిశబ్దం
బీ బీ బి బీ బీ బి బి బీ బి బీ బిః

ఒకరోజు భోజరాజు సౌధోపరిభాగమున అభ్యంగన స్నానం చేయసంకల్పించెను. ఆసమయమున అతని కభిషేకము చేయునొక, కాంతారత్న మాతనిం జూచి మోహపారవశ్యమున తన చేతనున్న బంగారు జలకలశమును 'జాఱవిడిచెను.' ఆ పాత్ర మేడ మెట్లనుండి టంటం' అని మ్రోగుచు క్రిందపడిపోయెను. ఆదివిని భోజరాజు సభలో.

'టం టం టం టం టం టం టం టం టం పూరించమన్నాడు. కాళిదాసుపూరించెను.

శ్లో. రాజ్యాభిషేకే, మదవిహ్వలాయా
హస్తచ్యుతోహేమఘటోయువత్యాః
సోపానమార్గేషు కరోతి శబ్దం
టం టం టం టం టం టం టం టం టం.

శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో హాస్యచతురుడు, ఆశుకవితానిధి తెనాలి రామలింగడు ఉండేవాడు. ఒకసారి సమస్యను శ్రీకృష్ణదేవరాయలు పూరించ మనెను.('కుంజరయూథమ్ము దోమకుత్తుక జొచ్చెన్')

కం. రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుకొల్వ పాలైరకటా
సంజయ! విధి నేమందును
కుంజరయూథమ్ము దోమ కుత్తుక
జొచ్చెన్.

ఇదేసమస్యను వేరొకరికి ఇంకొకవిధముగ చెప్పెను.

గంజాయితాగి, తురకల
సంజాతముచేత కల్లు చవిగొన్నావా
లంజల కొడకా, ఎక్కడ
కుంజరయూథమ్ముదోమకుత్తుకజొచ్చెన్.

అష్టావధాని డా। చిలుకూరి వీరభద్ర శాస్త్రిగారి నొకసభలో ఒక సమస్య పూరించ మన్నారు, అది అందుకోండి.

సమస్య : 'తొమ్మిదిలో నొకటి దీయఁదొయ్యలిపదియా'; ఆయన మేధావి కాబట్టి వెంటనే ఇలా పూరించాడు.

కం. నమ్మెదవో నమ్మవొకో; కా
నిమ్మాగడియారమందుఁ దృష్టినినిలు
సుమ్మా ! రోమను నంకెల
దొమ్మిదిలోనొకటిదీయతొయ్యలిపదియా.

కుందవరపు కవిచౌడప్ప పద్యాల్లో సున్నితమైన హాస్యాన్ని అందిస్తాడు.

కం. ఆడినమాటలు తప్పిన !
గాడిదకొడు కంచుదిట్టగా విని మదిలో
వీఁడా కొడుకని యేడ్చును!
గాడిదయును కుందవరపు కవిచౌడప్పా!

అప్పాలవాని బెడద కవులకు, కూడా తప్పలేదు. ఒక పద్యాన్ని అందుకోండి

సీ. అంబరవీథి నుండి విల
యంబుగ దూకిడి బాకి దారుపై
అంబ కటాక్ష లేశమున
నల్లెడి పద్యముగూడ, రెండు పా
దంబులె పూర్తియై పిదప
తట్టక, యప్పాలవాని రెండు పా
దంబులు పట్టినట్టి కవి
తల్లజుఁ డీతడు సత్కరించుడీ.'

కవితావేశంఉంటే ప్రతీదీ కవితావస్తువే. ఉల్లిమీద చెప్పవచ్చు, పిల్లిమీద చెప్ప వచ్చు, అరటిపిల్లమీద చెప్పవచ్చు.

ఉల్లి అంటే ఎనలేని ఇష్టమున్న ఒక కవిగారు తమపద్యంలో ఇలాఅంటారు.

ఉల్లిని దూషించిన యీ
గుల్లామునుబట్టి ముక్కుగోయగవలదా!
తల్లుండవలయు, లేదా
యుల్లుండగవలయు భోజనోత్సవవేళన్.

మరొక కవి 'పిల్లి' మీద పద్యం వ్రాసాడు. అది ఎంత హృద్యంగా ఉందో చూడండి.

శ్రీరఘటాంబుధి స్థిరకంభ సంభవ
బహుమూషి కోరగ పక్షిరాజ
శుక కులమత్తేభ, నికరకంఠీరవ
శలభ సంకుల వనజ్వాలకీల
వృశ్చిక దానవ, విష్ణుసుదర్శన
వాయు మేఘాళి దుర్వార పవన
కుక్కుట పర్వత, ఘోరవజ్రాయుధ
పారావత మహాంధకార, సూర్య
యనగ నీవిట్లు వెలసితి వఖిలదిశల
వ్యాఘ్రకులమాతులస్వామి, శీఘ్రగామి
పయనములమిత్తి, దొంతరపాలక త్తి
సకలగృహవర్తి, మార్జాలచక్రవర్తి.'

ఇక అరవపిల్లపై శ్రీనాథుడు వ్రాసినట్లు చెప్పబడుతున్న పద్యం అందుకోండి.

'మేతఁ గరిపిల్ల, రణమున మేకపిల్ల
పాలుబోతుతనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను చెలుపంగ బిల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యీ యరవపిల్ల.'

కీ. శే. వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులుగారు ప్రఖ్యాత వ్యాకరణపండితులు. ఒకసారి ఒక అబ్బాయి ద్రాక్షారామంలో 'వ్యాకరణ పారీణ' చదువుకోవాలని వజ్ఝలవారిని, కలిశాడు. ఆకోర్సు చదవాలంటే ఆరోజుల్లో ఎవరైన లబ్ధప్రతిష్ఠులైన పండితులు ఒకఉత్తరం వ్రాసిస్తే సరిపోతుంది, చేర్చుకుంటారు. శ్రీ శాస్త్రులుగార్ని అడిగాడు. ఆయనకీ ఇవ్వాలనే ఉంది. అయితే అతని గుణగణాలు, శక్తిసామర్థ్యాలు తెలియకుండా ఇంతవాడు, అంతవాడు అని వ్రాయడం ఆయనకు ఇష్టంలేదు. ఆ అబ్బాయిని ఒక ప్రశ్న వేశారు. 'నాయనా, నీ వెవరబ్బాయివి? బుర్రావా రబ్బాయినండి. సరే పిలకను సాధించు, ఉత్తరం ఇస్తాను అన్నారు. ఆ అబ్బాయికి కోపంవచ్చింది. మొగం జేవురించుకొని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. దానికి కారణం శాస్త్రిగారి మాటలు మరోవిధంగా అర్థం చేసుకున్నాడు. క్రాపింగుఉన్న ఆ బుర్రావారబ్బాయి, క్రాఫుతీసి 'పిలక' పెట్టుకొని వస్తే ఉత్తరం ఇస్తారు కాబోలు ననుకున్నాడు. శాస్త్రిగారి ఉద్దేశం అది కాదు. 'పిలుచు' అన్న ధాతువునుంచి 'పిలవక' 'పిలక' అన్న రూపాలు వ్యాకరణం చేత సాధించవచ్చు, దాన్ని సాధిస్తే ఉత్తరం ఇద్దామని శాస్త్రిగారి ఉద్దేశం.

ప్రముఖ హాస్యరచయిత మొక్కపాటి నరసింహశాస్త్రిగారు 'బారిష్టర్ పార్వతీశం' మొదటిభాగం వ్రాసి చాలా కాలమైనా, రెండోభాగం వ్రాయలేదు. ఆయన రాజమండ్రి సభకి వచ్చినపుడు ఎవరో అడిగారు 2, 3 భాగాలు ఎప్పుడు రాస్తారని? దానికి ఆయన సమాధానం వినండి. "చిలకమర్తివారు ఇలాగే 'కర్పూరమంజరి' మొదటిభాగం వ్రాసి, తరువాతి భాగం ఎంతకీ వ్రాయక చివరికి వృద్ధాప్యంలో వ్రాశారు. అది వ్రాసిన 2, 3 సం॥లకు ఆయన మరణించారు. అలాగే నాకూ అవుతుందేమో అని భయపడుతున్నా నన్నారు. అందరూ పెద్దపెట్టున, నవ్వారు. ఆయన వ్రాసిన (2, 3 భాగాలు) అతిస్వల్ప కాలానికే మరణించారు.

ఒకసారి సర్. సి. ఆర్. రెడ్డిగారు యూనివర్సిటీలో ఒకాయన పేపర్లు దిద్దుతూంటే ఆయన ప్రక్కనే కూర్చొని పిచ్చాపాటి మాట్లాడినపిదప ఏం పరీక్ష పేపర్లవి? అని అడిగారు.

"షేక్స్పియరు నాటకంమీద పరీక్ష" అన్నాడాయన

"బాగా వ్రాసిన వాడికి ఎన్నిమార్కులేస్తారు?"

50 లేక 60 వేస్తాం.

అంతేనా!

అంతే.

షేక్స్పియరే వచ్చి రాస్తేనో?

70 వేస్తాం!

'మిగతా 30 వెయ్యరా?

'వెయ్యం'

ఎవరికీ వెయ్యరా?

ఎవరికీ వెయ్యం.

ఎవరికీ వెయ్యకపోతే ఆ 30 మార్కులు లేనట్లేగద. అప్పుడు ఆ 25 మార్కులకే పాసుచెయ్యాలి. రూల్సు మార్చుకోండి అన్నారాయన, నవ్వుతూ. నూటికైతే 35 రావాలి, గాని 70 కి అయితే 25 వస్తే పాస్' అని వారు చమత్కరించారు.

ప్రముఖ ఫ్రెంచి కవి సేంట్ ఫాక్స్కు ఎంత డబ్బు వచ్చినా అప్పులే ఎప్పుడూ. ఒకసారాయన గడ్డం చేయించుకోడానికి క్షౌరశాలలో కెళ్ళి కూర్చున్నాడు. క్షౌరశాలలో ఆయన గడ్డానికి బాగా నురగ తేలేలా సబ్బు పట్టించి క్షౌరకార్యక్రమంలోకి ఉపక్రమించు చుండగా ఎవరో అగంతకుడు ఎక్కడ్నుంచో గదిలోకి ఊడిపడ్డాడు. అతగాడు ఫాక్స్ ఋణదాతల్లో ఒకడు. ఫాక్స్ని చూడగానే మండిపడుతూ, తన బాకీ సంగతి తేల్చమన్నాడు. ఫాక్స్మాత్రం ఏ మాత్రం తొణక్కుండా, పాపులో ఏ గొడవా చేయొద్దని ప్రశాంతంగా నచ్చచెప్పి తాను గడ్డం చేయించుకునేదాకా, కాస్త ఓపిక పట్టవల్సిందిగా కోరాడు.

అందుకాయన సమ్మతించాడు. ఋణదాత వసూలు కాదనుకున్న బాకీ త్వరలోనే రాబోతున్నందుకు సంతోషిస్తూ ఫాక్స్ కోరిక మన్నించాడు. ఫాక్స్ తన గడ్డం చేయబోతున్న వ్యక్తిని నివారించి టవల్‌తో గడ్డాని కున్న సబ్బునురగ తుడిచి వేసుకుని షాపునుంచి నిష్క్రమించాడు. ఫాక్స్ మాత్రం జీవితాంతం మళ్ళీ గడ్డం చేయించుకోలేదు.

ప్రముఖ రచయిత హక్స్‌లీని ఒకానొకాయన 'రచనలు చేయడం ఎలాగని అడిగాడట. నవలాకర్తగా, ప్రపంచ ప్రఖ్యాతి నొందిన హక్స్‌లీ ఆ పృచ్ఛకుడి కేసి, చూసి, చాలా నిదానంగా–ఇలా అన్నాడు "రచన చేయడమా? దానికేముంది?...బజారుకెళ్ళి ఓ దస్తా తెల్ల కాగితాలు, ఓ మంచి కలమూ కొనుక్కురావడం, ఇంటికి రాగానే కాగితాల మీద కలంతో రాసెయ్యడమే! అన్నాడు.

ప్రముఖ తత్త్వవేత్త సోక్రటీస్ భార్య గయ్యాళి. ఒకసారి సోక్రటీస్ చెప్పిన పని చెయ్యలేదని కోపం వచ్చి చివాట్లు వేసి, నిండా నీళ్ళున్న కుండతో తల మీద కొట్టింది. అప్పుడు సోక్రటీస్ నవ్వుతూ ఇలా అన్నాడు "ఇంత గర్జన చేసిన పర్జన్యం (మేఘం) ఈ కాస్త వర్షాన్నే కురిపించింది." ఆయన చమత్కారంగా అన్న ఒకమాట జీవితనగ్న సత్యం. ఏమిటంటే "పెళ్ళిచేసుకో భార్య సుగుణవతి అయిందా సంతోషం; భార్య గయ్యాళైందా వేదాంతి వవుతావు" అన్నాడు.

హరికథా పితామహుడు శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు మంచి హాస్యశీలి, మాత్రమేకాదు రసికులు కూడా! ఒకసారాయన నెల్లూరు వెళ్ళారు అక్కడ నెరజాణలను చూడాలని నగరసందర్శన ప్రారంభించారు. ఒక వీధిలోంచి వెళుతుంటే ఒక అందమైన యువతి గుమ్మం వద్ద నిలబడి మెల్లగా నవ్వి ఒక చెంబెడు నీళ్ళు చిలకరించి "మబ్బులేని వాన" అంటూ కిలకిల నవ్వి, తుర్రున ఇంట్లో దూరింది. ఈయనకి కోపం వచ్చి, ఒక్క అంగలో ఆమెను సమీపించి వీపుమీద పిడిగుద్దు వేసి 'ఉరుములేని పిడుగు' అంటూ రోడ్డు మీదకు వచ్చారు. ఆ నెరజాణకు, చచ్చినంత పనైంది. కిమ్మనకుండా చక్కాపోయింది.

హాస్య రచయిత మునిమాణిక్యం నరసింహారావుగారొకసారి తన కాంతాన్ని (భార్య) పిల్లవాడు ఏడుస్తున్నాడనికోపపడి, గాడిదా! పిల్లవాడికి పాలుపోయి! అని కేకలేసి బయటికి వెళ్ళిపోయారు. ఆవిడ చాలాచమత్కారి, సమయస్ఫూర్తి గలావిడ. ఆమాటకు సమాధానం చెప్పాలనుకుంది. సాయంకాలం ఆఫీసునుంచి వచ్చి ఆయన మళ్ళీ ఇలా అన్నారు 'గాడిద పాలు పోసావా, పిల్లాడికి? అని. అప్పుడామె 'అయ్యో! మర్చిపోయానండి. మిమ్మల్ని చూస్తేనే గాని గుర్తురాలేదు!' దాంతో ఆయన నోరెత్తలేదు. ఇంకోసారి వాళ్ళమేడమీద నుంచి క్రిందకు వస్తున్నాడు, అదే సమయంలో ఆవిడ పైకి వెళ్తోంది. ఆదారి ఒక్కరికే వీలుగా ఉంటుంది. తప్పుకోండి పైకివెళ్ళాలంది ఆవిడ. ఆయన 'నేను మూర్ఖులకు చోటివ్వను' అన్నాడు. అయితే 'నేనిస్తా' నంది. ఇంకోమారు టీచర్ ట్రైనింగుకు వెళ్ళాడు. హెడ్ మాస్టారన్నారుట ఏదో ప్రశ్నలకు సమాధానం చెప్పలేకపోతే, నీవెందుకు పనికివస్తావయ్యా టీచర్‌కి? దానికి ఆయన తడుముకోకుండా 'పోనీ హెడ్‌మాస్టారు పోస్టు ఇప్పించండి' అన్నారు. ఆయన నిర్ఘాంతపోయాడు.

జీవితాన్ని సంస్కృతభాషాభివృద్ధికి అంకితంచేసిన మహామహోపాధ్యాయుడు స్వర్గీయ శ్రీ కాశీ కృష్ణాచార్య సద్యస్ఫురణ రసహృదయం గల మంచివక్త. ఒకసారి బందరులో ఘనసన్మానం జరిగింది. వేదికమీదకు ఆహ్వానిస్తూ కార్యకర్త 'కాశీకృష్ణమాచార్య' అని సంబోధించాడు. తర్వాత సాగిన పరిచయ వాక్యాల్లోకూడా 'కృష్ణమాచార్య' అనే పలికారు. ఆచార్యులవారు ఆకార్యకర్తల పొరపాటు గ్రహించి తమ ఉపన్యాస ఆరంభంలో 'పరిచయకర్తలన్నట్లు మాకు నడిమంత్రపుసిరి లేదు! నాపేరు కృష్ణాచార్యమాత్రమే' ('మా' అంటే సిరి అని అర్థంకూడా ఉంది.) అన్నారు.

ఒకసారి 65 సం॥ వృద్ధుణ్ణి బాలలఅకాడమీ కార్యదర్శిగా నియమించారు. ఆయనొకరు అడిగారు. మీరు వృద్ధులుగదా బాలల అకాడమీ కార్యదర్శిపదవి స్వీకరించేరేమని. దానికిఆయ నిలాఅన్నారు '60 ఏళ్ళ తర్వాత ద్వితీయ బాల్యం ప్రారంభమౌతుందంటారు కదా! నాకిప్పుడు 5 సంవత్సరములు మాత్రమే, మరి నేను వృద్ధుణ్ణి ఎలాఅవుతాను?' అని మళ్ళీ ప్రశ్నించారు.

**N.B**:– ఈ వ్యాసరచనకు క్రింది పుస్తకాలు, పేపర్లు పరిశీలించాను.

1. భావతరంగాలు (ద్వితీయ భాగం –డా॥ చిలుకూరి వీరభద్రరావు
2. కాళిదాసు
3. చిత్రచాటుమణిమంజరి– కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి
4. శతకకవుల చరిత్ర–వంగూరి సుబ్బారావుపంతులు
5. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి పేపర్లు

# శంతనుఁడు

— శ్రీ కావూరి పూర్ణచంద్రరావు,
ఎం.ఏ., బి.ఓ.ఎల్.

---

ఒకరుఁడు విద్యలిచ్చు తన
కున్నది వాక్సతియాటచేత వే
ఱొకరుఁడు భాగ్యమిచ్చు తన
కున్నది శ్రీసతి యాటచేత నిం
కొకరుఁడు శక్తినిచ్చు తన
కున్నది శక్తిసరూపయాట నీ
తికమక లేల ? మువ్వురకుఁ
దేజ మొసంగిన శక్తిఁ గొల్చెదన్.

మును మహాభిషుఁ డిక్ష్వాకు మనుజ విభుఁడు
రాజసూయ శతాధ్వర రమ్యకీర్తి
అశ్వమేధ సహస్రంబు లాచరించి
సత్యలోకంబుఁ జేరె తచ్ఛక్తి మహిమ.

అతఁడు దేవర్షి గణముతో నాత్మభవుని
సేవలోనున్న సమయానఁ జేరవచ్చె
వదన జలజాక్షి జలజాంఘ్రి వనజహస్త
జలజ సురభిళంబగు గంగ నలువసభకు.

కాంతాకార మనోజ్ఞరూపయగు గం
గాదేవి యేతెంచి వా
క్కాంతా వల్లభ సభ్య సభ్యుల
యెడన్ గాలూని నిల్వంగఁ ద
త్ప్రాంత స్పర్శన వీచికావళి
గతిన్ వస్త్రావధూతంబుగాన్
ఎంతే నింతి మృదూరు వచ్చటి
సభాదృగ్వీథి భాసించినన్.

కటకట సభ్యులెల్లరు ము
ఖంబులు ప్రక్కకు ద్రిప్పికొంచు సం
కటపడుచుండ నొక్కరుఁడు
కామవికార ముఖారవిందుఁడై
స్ఫుటిత తదూరుదృష్టి మది
చొక్కినఁ గాంచి విరించి వానితో
కుటిల మహాభిషా ! చనుము !
కుంభినిపై జనియింపు మంచనెన్.

ఎన్నియజ్ఞంబు లొనరించి యేమిఫలము ?
ఎన్ని ధర్మంబు లొనరించి యేమిగుణము ?
పూర్వవాసన వానికేమూల నక్కె
నో ! సురత్వ మడిగి మనుష్యుఁడుగఁ బుట్టె

అంత ప్రతీపుఁ డన్న వసు
ధాధిపుఁ డాత్తవిశేష పుణ్యుఁడై
కాంత సునందతోఁ గలిసి
గాఢ మనోజ వినోద కేళిక
త్యంతము మేలుసూపినఁ బి
తామహ వాక్యనిబద్ధబుద్ధియై
శంతనుఁడై మహాభిషుఁడ
శంకితవృత్తి జనించె వారికిన్.

దినదిన వర్ధమాన శశి
తేజు మనోజ గుణౌజు శంతను
ప్రణుత పరాక్రమ క్రమకు
మారు కుమారు విశిష్ట రాజల
క్షణ చణశీలు ధీగుణ వి
శాలు ధరాధరధీరు వీరునిన్
గనిన ప్రతీపుఁ డావిధుని
గాంచిన యంబుధివోలెఁ బొంగెడున్.

కోరమీసంబు మెలివైచి గుఱిని జూచి
నారి స్పృశియించి విశిఖాళి నాటునపుడు
బెదరిపడునవి వానికి భీతహరిణ
గణమె కాదు! భీతహరిణేక్షణలుకూడ !

పెరిగి పెద్దవాఁడై భూమి భరముదాల్ప
వలతియైన శంతను మహీవల్లభునకు
వృద్ధరాజు ప్రతీపుఁడు విదిత మహిత
కీర్తి, రాజ్యలక్ష్మిని నొప్పగింపఁదలఁచి.

వినుము కుమార ! నీ కులము
వీరులు బాల్యమునందె విద్యనే
ర్వను – మఱి యౌవనంబునను
వైభవ భోగములంద – వార్ధకం
బున మునివృత్తి కానలకుఁ
బోవను – దీక్షవహింత్రు రాచబ
ర్వాను సుసమర్థులైన తమ
పుత్రులు దాల్చి వెలుంగ శంతనూ !

# స్వాతంత్ర్యానంతరం తెలుగు వికాసం

— శ్రీ సోమసుందర్.

( గత సంచిక తరువాయి )

విశ్వనాథవారి పాత్రల స్థితికీ గతికీ మధ్యగల సంబంధం హేత్వధీనమైన యోచనాధారతో క్రమవికాసం పొందడంమాని, కేవల శుష్క తార్కికోపలబ్ధమైన అతివ్యాప్తి పాత్రల ప్రాణశక్తిని క్షీణమొనర్చుతోంది. కనుకనే విశ్వనాథ నవలలద్వారా సాధించిన విజయం ఏదైనా ఉంటే అది వారి తార్కిక శక్తి సాధించిన విజయమేతప్ప, కళాశక్తి సాధించిన విజయంకాదు. తర్కంలో చిత్తయిపోయే పాఠకుడు, ఆతర్క ప్రదర్శనకోపన్యాసానంతరం మంచి సన్నివేశ స్వరూపాన్ని చూడగల్గుతానేమో అన్న ఆశతో ముందుకుసాగి, నీరసపడిపోతూ ఉంటాడు. పైగా ఆయనకు తాను దర్శించిన సమాజేతివృత్తాన్ని శ్రద్ధగా ప్రదర్శించాలన్న బాధ్యత ఎన్నడూ ద్యోతకంకాదు. కనుకనే రచయితకుగల జ్ఞానాన్ని ప్రదర్శించే విజ్ఞాన సర్వస్వాలవలె పుంజీకృతమయ్యాయేతప్ప, ఉత్తమ కళాఖండాలవలె భాసించలేక పోయాయి. వేయిపడగలు మొదలు పురాణవైరి గ్రంథమాలలోని చిట్టచివరి పుస్తకంవరకూ పాఠకునితలపై బరువులు మోపేవేగాని, హృదయాన్ని రంజింపచేసే కళాగుణాన్ని స్వాయత్తం చేసుకొన్నవి కావు! దీనివల్ల రచయితగా తన నవలలద్వారా అందించే బుద్ధివికాసం (enlightentment) లో లాగ కొరగాని దవుతుంది; హృదయ రంజకత్వం (Delight) లేని కారణంవల్ల బుద్ధివికాసానికి నవలలను సాధనాలుగా ఏ బుద్ధిహీనుడూ పరిగ్రహించడు. కళాశీలతద్వారా సాధించే ఆనంద ప్రాప్తి ప్రచారకుని చేతిలో బందీగా మారి, గిలగిల లాడటమే ఫలశ్రుతిగా మిగులుతుంది. ఏ తావతా శ్రీవిశ్వనాథవారి నవలలు_ న లలుగా కళాఖండాలుగా అపజయ పాలవడం అందరూ అంగీకరించే విష యమే! పోతేవారి నోటికి జడిసి బహిరం గంగా ఎవరూ ఈ సత్యాన్ని ఉద్ఘాటిం చక పోవచ్చుగాక!

పాఠకుని ఆలోచనలను, అతని స్వీయ జీవన సమస్యలనూ, తర్కబుద్ధినీ, ఇతరేత రమైన సవాలక్ష ప్రాపంచిక అనుబం ధాల్నీ నవలారచయిత భగ్నంచేయాలి పాఠకుణ్ణి మానసికంగా ఒక అవిచ్ఛిన్న మైన అజ్ఞాతమైన గొలుసుతో కట్టేసి తనకూడా నవలారచయిత నడిపించు కుంటూ పోవాలి. ఎక్కడేనా పట్టుజారి తన శిల్పంలో, చిత్రణలో పరాజయం పొందాడా పాఠకుడు తత్క్షణం స్వేచ్ఛను ప్రకటించి_సదరు నవలను విసి కొడతాడు!

ప్రపంచ సాహిత్యంలో ఏ ఉత్తమ నవ లను తీసుకున్నా మనకు రుజువయ్యేసత్యం ఇదే! టాల్‌స్టాయ్ అనా కెరినీనా కాని, అనటోల్‌ఫ్రాన్స్, థాయ్‌కాని, గోర్కీ అమ్మ కాని, రోమారోలా జాంక్రిస్టోఫ్ కాని మరే

నీవతివేల పౌరుష ఖ
  నిప్రథితుండవు_రాజనీతి వి
ద్యా విధివార్త పుణ్యుఁడ వ
  నంత భుజాబల వీర్య ధైర్య సం
భావిత శక్తివిన్ జతురు
  పాయ ధురీణుఁడ విట్టి నీకు నీ
భూవలయంబు నేల _ వన
  భూముల కేగను_నాకు వేళయా.

పుత్రుఁ డుద్భవించి పున్నామ నరకంబు
తొలచి పుణ్యలోకములు ఘటించు
వంశదీపకుండు ప్రతిభాయుతుండునౌ
పుత్రు నొకని నీవు పొందవలయు.

గంగాతీర పవిత్రభూముల మహా
  శాంతిన్ గుబాళించు సా
రంగాంకాస్య నొకర్తుగాంచితి_ధవ
  ద్రాజ్ఞీపదం బామెకే

నంగీకార మొనర్చినాను, పితృవా
  క్యం బింత మన్నించి_త
ద్దంగా స్వచ్ఛసుశీల నైకొను మనం
  తా కాంతకుం దోడుగా !

అనుచు ప్రతీపుఁ డాడు సమ
  యంబున మానగభీరమూర్తి శం
తనుఁడు కృతజ్ఞతాభరన
  తంబగు శీర్షముతో_విధేయతల్
తోనఁక తదీయ పాదయుగ
  తోయరుహంబుల కంజలింప_జా
రిన పితృహర్ష బాష్పకణ
  రేఖలు_సూనుశిరోఽభిషేకముల్.

[ 'భీష్మ' కావ్యమునుండి

—oo❖oo—

ఉత్తమ నవలగాని చదువుతుంటే పాఠకుడుగా మనకు కలిగే దివ్యానుభూతి ఇట్టిదే! ఈ నవలలలో బుద్ధివికాస సంబంధి లేదని కాదు. హృదయరంజకత్వంతో అంతర్లీనమై ఒక మాధుర్య భ్రమాస్పదచేతస్కునిగా పాఠకుని తీర్చుకుంటూ విజయం సాధిస్తాయి.

మరొక్క విషయంకూడా ఇక్కడే మనం ప్రస్తావించుకోవాలి. భాషాభివ్యక్తిలో అను ప్రాసాది శబ్దాలంకారాల జోలికి ఆధునిక నవల ఎన్నడూ మోజుపడకూడదు. తెలుగు నవల ఆరంభ దశలో గాని, చిన్నయసూరి పంచతంత్ర రచనకు గాని, పానుగంటివారి సాక్షి వ్యాసాలకు గాని యమక గమక అంత్యాను ప్రాసాది శబ్దాలంకారాలు ఆదిమ సౌందర్యాలను చేకూర్చి ఉండవచ్చునేమోకాని - ఆధునిక నవలమాత్రం ఇలాంటి బరువునగలను ఒల్లదు. శక్రటరీ అనేనవలలో ఒకటి రెండు పేజీలు పూర్తిగా అకారారంభ పదజాలంతో నింపి బోర్ కొట్టడం జరుగుతుంది. ఇలాంటి శాబ్దికమైన ఫీట్లు, జమ్మిక్కూ సాహిత్య ప్రక్రియగా నవల ఎంతమాత్రం సహించదు. నవలకు ఆలోచనా ప్రేరకమైన సరళసుందరశైలీ విన్యాసం ఉంటే చాలు. నవలే నన్నమాటేమిటి? అలాంటి తక్కువరకపు శిల్పప్రదర్శనను ఆధునిక సాహిత్య ప్రక్రియ లేవీ అంగీకరించవు. వాక్య విన్యాసంలోని గారడీలు నవలా పరిధికి బొత్తిగా సరిపడవు!

ఒక సమస్యపై గాఢానురక్తి కలిగిన రచయిత చప్పున ప్రచారకుని స్థాయికి దిగజారి పోతూండడం సర్వసామాన్యమే! జీవనసమస్యలు నవలలలో స్ఫురించబడరాదని ఏబుద్ధిమంతుడూ అనలేడు. కాని సర్వసమస్యా పరిష్కారానికీ నవల ఉపాదేయం కారాదు. నవలా రచయిత బాధ్యత సమస్యలను ప్రదర్శించి పాఠకుని బుద్ధి కెలయించడమే గాని, సమస్యాపరిష్కారకేంద్రీకృత బుద్ధితో కళాస్వభావాన్ని ఉపేక్షించే రచయితకు ఉత్తమ గతులు లభించవు. కళ క్రిందై, సమస్య మీదైతే నవలకు ప్రేతకళ ప్రాప్తిస్తుంది. కనక నవలారచయిత తన బలాబలాలనూ సరిహద్దులనూ బేరీజువేసుకుంటూ సంయమిత బుద్ధితో నవలాసృజన చేయాలి.

సమాజాన్ని పీడిస్తున్న ఒకానొక జటిలసమస్య-నవలలో సీదాగా పరిష్కారం పొందినంత మాత్రంలో రెండ్రెళ్లు నాలుగు వంటి గణితంలాగ తత్క్షణం సమాజంలోకూడా ఆసమస్య పరిష్కారమైపోగల రని ఎవడైనా దురాశకులోనైతే- అట్టివాడు అటు కళకీ, యిటు సమస్యా ప్రదర్శనకూ కూడా దూరమవుతాడు. నవలలో అంతర్నిబిడమైన ఉపదేశం వ్యంగ్యంగా భాసించినప్పుడే పఠిత హృదయంలో గాఢముద్రకు అవకాశం ఉంటుంది. పాత్రను యథేచ్ఛగా పెరగనీయకుండా, రచయిత యిష్టానుసారం మలుపులు త్రిప్పుకుంటూ పోతే- పాత్ర జీవన వాస్తవికత భంగమవుతుంది. వికలాంగమై మిగులుతుంది. నవలాకారుడు నవలలోని యితివృత్తాన్నీ పాత్రల మానసిక సంఘర్షణనీ ప్రధానంగా చిత్రించాలి తప్ప - తన స్వీయప్రజ్ఞా పాటవాలను బహిర్గతం చేయాలన్న దుగ్ధకులోనైతే- రచయిత తన సంకల్పంలో విజయం పొందలేడు సరిగదా, తన నవలను సైతం ఆకర్షణీయంగా తీర్చిదిద్దలేడు.

నవలలో ప్రతి పాత్రను గురించిన భోగట్టా రచయితకు పూర్తిగా అవగాహనలో ఉండాలి. ఆ పాత్ర తాలూకు సాంస్కృతిక స్థాయి, నిర్వహించవలసిన కర్తవ్యమూ రచయిత బుద్ధిగతమై ఉండాలి. ఈ భోగట్టాలోపిస్తే-ఆ పాత్ర నోట-అనరాని మాటలను రచయిత అనిపించవలసి వస్తుంది. పాత్రకన్న పాత్ర ఆలోచనలూ ఆచరణలూ, అభిభాషణలూ స్థాయి పెరగడమో, తరగడమో జరిగి రసభంగం కలిగిస్తాయి. రచయిత స్వీయసంస్కారం పాత్రలపై మోపడం- ఆ కొసను విశ్వనాథ వారూ, ఈ కొసను కొడవటిగంటి వారూ కూడా ఒకే మాదిరిగా ప్రమాదానికి పాల్పడ్డారు.

రచయిత సంస్కారముద్రతో వెలువడిన పాత్రలు - స్వీయ వ్యక్తిత్వంతో జీవించలేవు. నవలలో కూడ-నాటకంలో వలెనే స్వీయవ్యక్తిత్వం సంతరించుకొన్న పాత్రలే సజీవపాత్రలు. అల్పసంభాషణలతో అనల్పభావాన్ని స్ఫురింపచేయాలే తప్ప - తద్భిన్నంగా దీర్ఘోపన్యాసాలివ్వడం-రెండు ప్రక్రియలలోనూ సమానంగానే కళాభగ్నతకే దారితీస్తుంది. నేడు అధిక ధనపురస్కారం పొందుతున్న ఉగాది నవలలోని అత్యధిక భాగం స్వీయంవ్యక్తిత్వం కోల్పోయిన పిండి బొమ్మలతో క్రిక్కిరిసి పోతున్నవే! పాత్రలు ఒక సమాజ పార్శ్వనుంచి ఉద్భూతమైనట్లుగాక- రచయిత మనోరంగం నుంచి మాత్రమే ఊడివచ్చినట్లు కనిపిస్తాయి.

నవలాకారులు తమ వైయక్తిక జీవితంలో ఈడేరని యీప్సితాలనో, తీరని కోరికలనో నవలలద్వారా సంతృప్తిపరచుకొందుకు ప్రయత్నించరాదు. ఈ ప్రయత్నంవల్ల అటు రచయితకూ, యిటు రచనకూ పుష్టిచేకూరదు. సినిమాల ననుసరించి నవలలూ, నవలల ననుసరించి సినీమాలూ తెలుగుదేశాన్ని ఒక అవాస్తవిక ఊహాస్వర్గానికి తీసుకుపోతున్నాయి. మధ్యతరగతి గృహిణులు చదవడానికి పుట్టిన ముఖచిత్రాల రజ్జుతో వెలువడే వారపత్రికలలో మధ్యతరగతి కుటుంబినీ మానసిక బలహీనతలను సమర్థిస్తూ ఒక ఊహాస్వర్గంలో వారిఆత్మలను ముంచుతూ ఉభయత్రా తమ పబ్బం గడుపుకుంటున్నాయి. నవలకు సంబంధించిన పాత్రల

చర్యలూ, ప్రతిచర్యలూ, సంభాషణలూ ఆలోచనలూ–అన్నీ వాటికి గల సామాజిక ఆర్థిక సాంస్కృతికాది సమస్త ఆవరణలనూ అధఃకరించి, కృతకాద్రుల నధిగమించడం పుష్టికి బదులు సాహిత్యానికి నష్టినే చేకూరుస్తుంది.

నవలల్లోని పాత్రల శీలపరిశీలనలో వైవిధ్యాన్ని సంతరించుకోవడం రచయిత ప్రజ్ఞకు నికషోపలంవంటిదే. ఇటీవలి అనేక నవలలో ఒకే నమూనా పాత్రల విజృంభణ అపారమైపోయింది. రచయిత విచక్షణ–ఒకే నవలలోని అనేక పాత్రల పట్లా కేంద్రీకృతమై అమలు జరగడం అత్యంత ప్రతిభా సమున్మీలనానికి తార్కాణం. ఎన్ని నవలలూ కథానికలూ రచించినా చిత్రించిన యితివృత్తాన్నే తిరిగి తిరిగి ప్రతిబింబించే రచయిత కళాకారుడు కాడు. ఇలాంటి రచన గాడిద ఊక మేసినట్లు నిరర్థకమే అవుతుందన్న సత్యాన్ని వర్ధమాన నవలాకారులు గుర్తించుకోవాలి!

పాత్రల సత్ స్వరూపాన్ని గురించి, వాటిహావభావ విశేషాలనుగురించీ, వాటి జీవిత ప్రమాణాలను గురించీ, ఉత్తమ నవలాకారులు రచన కుపక్రమించే ముందే స్పష్టంగా రూపరేఖలను తమ మనః ఫలకంపై చిత్రించుకుంటారు. కథన ప్రణాళికను గురించి క్షుణ్ణంగా అవగాహన చేసుకొని, నిర్ధరించుకుంటారు. రచనాసంవిధానం గురించీ, సాంప్రదాయికంగా వస్తున్న కథన పద్ధతిలో తాము సాధించదలచిన వినూత్న ప్రయోగం గురించీ, సాకల్యంగా నిర్ణయ బుద్ధులవుతారు. ప్రపంచ సాహిత్యంలో శాశ్వత యశస్వులైన సిద్ధులంతా ఈ సర్వవిషయాలపట్లా ఎంతో జాగరూకత వహించినట్లు వారి నవలలే సాక్ష్యమిస్తాయి. కాని చేతికి వచ్చినట్లల్లా రాసుకుంటూపోయి, నిర్ణీత సంఖ్యకు వ్రాత ప్రతి పుటలు చేరుకోగానే ఒక్క అద్భుతమైన మలుపుతో కథా కథనాన్ని ముగించి ఆకవిల కట్టను నవలగా డబాయించి ప్రజల మొహాన్ని కొట్టిన దాఖలాలు ప్రపంచసాహిత్యంలో ఎక్కడా కనిపించవు.

మన నవలాకారుల్లో తప్పిజారి ఒకరో యిద్దరో తప్ప అత్యధిక సంఖ్యాకులు రాసిన దాన్ని మళ్ళీ ఒకసారి జాగ్రత్తగా చూసుకోవాలనికాని, దిద్దుబాట్లు చేసుకోవాలనికాని, రివైజ్ చేసుకోవాలని కాని తెలియని పూర్ణప్రజ్ఞావతారులు! ఒక కొమ్ములు మొలిచిన రచయిత ఒక యింటర్వ్యూలో తాను రాసిన పుటలు మళ్ళీ తిరిగి చదువుకోనైనా చదవకుండానే అచ్చుకు పంపిస్తానని గొప్పగా చెప్పుకున్నాడు! ఇది ఎంతమాత్రం ఘనత కాకపోగా, యిది రచయితకు సహజాతమైన మాంధ్యమేనా అవుతుంది; లేదా బుద్ధిపూర్వకంగా చెప్పే పొగరుమోతుతనమేనాఅవుతుంది. ఇంతవరకూ ఏనవలాకారుడూ టాల్‌స్టాయ్‌కన్నా కళాహృదయంలో గొప్పవాడు కాడు. మన తెలుగు దేశంలో హామ్యోరామా; అసలే పుట్టలేదు! ఆలాంటి టాల్‌స్టాయే పాపం తన 'సమరమూ శాంతీ' అనే పద్దెనిమిదివందల పేజీల నవలను పందొమ్మిదిసార్లు రివైజ్ చేసుకొన్నానని స్వయంగా చెప్పుకొన్నాడు. ఎన్నో దిద్దుబాట్లు చేసుకున్నాననీ, ఎన్నో ఘట్టాలు మార్చుకున్నాననీ రాసుకున్నాడు.

ఈ వ్యాసాన్ని ముగిస్తూ ఒక చిన్న ఉదంతాన్ని చెప్పవలసివస్తోంది. ఆమధ్య నేనొక వర్ధమాన రచయిత రాసిన నవల చదవడానికి ప్రయత్నించడం జరిగింది. దానికి అకాడెమీ బహుమతి కూడా లభించింది. పాపం ఆ రచయితస్వయంగా తన గ్రంథాన్ని పంపి, సావిమర్శ పంపమన్నాడు. అందులో కథా ప్రణాళిక ఆకుకు అందక పోకకు పొందక చాలా అస్తవ్యస్తంగా ఉంది. ముందు పుటల్లో ఉండే పాత్రల సంబంధాలు తర్వాత పుటల్లో అనాలోచితంగా వాటి యిష్టం వచ్చిన రీతిగా మారిపోతాయి. ముందు పుటలో నాయకుని కోక సుశీల అనే చెల్లి ఉందనుకోండి; అది మరికొన్ని పుటల తర్వాత అక్కగా మారిపోతుంది. ఇంత ప్రాథమిక దోషాన్ని సైతం సరిదిద్దుకోని రచయితలకు పురస్కారా లెలా లభిస్తున్నాయో ఆ దేవుడికి కూడా తెలియదు!

తమ కుహనావాదాలకు బోటులుగా కొన్ని పాత్రలను సృష్టించుకుంటూ పోవడం ఉత్తమ కళాసంవిధానం కాదు. పాత్రలుకాని, పాత్రల సంభాషణలు కాని, సన్నివేశాలుగాని, కృతకంగానూ అసహజంగానూ, అవాస్తవికంగానూ ఉన్నట్లు పాఠకుడు పసికట్టాడా, వెంటనే ఆ నవలను అసహ్యించుకుంటాడు. పాఠకు లంతా అజ్ఞానులనీ, లక్కబొమ్మలనీ, తామెలారాసినా చచ్చినట్లు చదువుతా రనీ పొగరు తలకెక్కిన రచయితలూ, రచయిత్రులూ– గిల్టునగల వలె కొంతకాలం తళతళ లాడవచ్చుగాక! కాని శాశ్వతంగా మాత్రం అపకీర్తి భాజను లవుతా రని అప్పుడే వర్తమాన చరిత్ర కొందరిపట్ల నిష్కర్షగా ప్రకటించింది. మిగిలిన కాకిబంగారపు మెరుపు లద్దుకున్న అప్రతిభులపై అనతి కాలంలోనే కాలం తీర్పు చెప్పి తీరుతుంది!

# శ్రీశ్రీ కవిత్వం, వస్తువు, సంవిధానం

## ప్రభవ - మహాప్రస్థానం

(A study of Sri Sri's Poetry with special reference to content and technique)

— డా॥ మిరియాల రామకృష్ణ

తెలుగు కవిత్వానికి శ్రీశ్రీ బహూకరించిన సరికొత్త దృక్పథాన్నీ సమున్నత సంవిధానాన్నీ సముజ్జ్వల రీతినీ సమగ్ర స్పందననీ గురించి సమ్యక్సమాలోచన చేయడం నా లక్ష్యం. ఇందులో సత్యాన్వేషణను మించి నాకే విధమైన పక్షపాతాలూ లేవు. శ్రీశ్రీ పరిణతిని సరిగ్గా అర్థం చేసుకోవడ ముఖ్యమే నా ధ్యేయం.

ఆధునికాంధ్ర కవిత్వ చరిత్రలో పాత ప్రపంచం భావకవిత్వం. కొత్తప్రపంచం అభ్యుదయ కవిత్వం. ఈ రెండో ఉద్యమానికి ప్రవక్త, ప్రయోక్త అయిన మహాకవి శ్రీశ్రీ.

1933 లో శ్రీశ్రీ ఆరంభించిన నవ్య కవిత్వానికి అంతర్జాతీయత, సామ్యవాద వాస్తవికత, వ్యావహారిక భాష, మాత్రాచ్ఛందస్సులు, ప్రతీచీసాహితీ ధోరణులు మొదలైనవి ప్రాణధాతువులు. తొలి రోజుల్లో ఆయన దీన్ని 'నవ్యకవిత్వం' అన్నారు. కానీ 1950 లలో ఆదొక ఉద్యమంగా మారి 'అభ్యుదయకవిత్వం' గా రూఢికెక్కింది.

1933కు ముందు శ్రీశ్రీదీ పాతప్రపంచమే. ఈయున కూడా భావకవిత్వపు పూలనావలలో, యౌవనకాళల నవవేళల సుమగీతావరణంలో విహరించినవాడే. అందువల్లనే పాతవ్యవస్థకు వారసుడై కొత్తవ్యవస్థకు జనకుడవుతూ ఆ ప్రపంచపు తుది దశలోనూ ఈ ప్రపంచపు తొలిదశలోనూ చరిత్ర కెక్కుతున్నాడు. చరిత్రలో భావకవిత్వాధ్యాయం శ్రీశ్రీతో ముగుస్తుంది.

1933 నుంచి 1947 వరకూ రచించిన గీతాలలో నుంచి ప్రత్యేక లక్ష్యంతో 41 గీతాలను మాత్రం ఏర్చికూర్చి ముద్రించిన మహాకావ్యమే మహాప్రస్థానం. ఈ గీతాలలో కవి మరోప్రపంచాన్ని దర్శించి దాన్ని ప్రదర్శించాడు. సామ్రాజ్యవాద వ్యవస్థలో ఉంటూ సామ్యవాద వ్యవస్థలోకి పురోగమనం సాగించడానికి ప్రయత్నించాడు. ఈ వ్యవస్థలోని పరపీడనను అభివ్యంజించాడు. అనితరసాధ్యమూ అపూర్వమూ అయిన పథాన్నావిష్కరించాడు.

శ్రీశ్రీ మహాప్రస్థానంలోని కవితా పూర్వరంగం కూడా దర్శించడం అవసరం. శ్రీశ్రీ భావకవిత్వాన్నీ అందులో నుంచి అభ్యుదయ కవిత్వంలోకి తీసిన కొత్తదారిని సంపూర్ణంగా దర్శించడమే ఈ సిద్ధాంత గ్రంథానికి సరిహద్దుగా నిర్ణయించుకున్నాను. అందువల్ల మహాప్రస్థానానంతర కృతులను ఈ పరిధిలోకి తీసుకోలేదు. ఆ కృతుల సమాలోచనం ఈ బృహద్గ్రంథంలో రెండవభాగం అవుతుంది. వ్రాతప్రతిగా ఉన్న ఆ గ్రంథాన్ని త్వరికగా పరిష్కరించుకొని ప్రకటించడానికి ప్రయత్నిస్తాను.

ఈపరిశోధన గ్రంథంలో సమాలోచనకు వచ్చిన శ్రీశ్రీ కవితా సంపుటాలు మూడు. మొదటిది ప్రభవ - 17 ఖండికలు. రెండవది - స్వర్గదేవతలు - 30 ఖండికలు. మూడవది మహాప్రస్థానం-40 ఖండికలు.

మహాప్రస్థానం 1950 లో వెలువడింది. అంతకుముందే అది సాహిత్య లోకంలో సంచలనం తెచ్చింది.

శ్రీ శ్రీ కవిత్వం సామ్యవాదోద్యమానికి ప్రధాన పరికరంగా పరిణతి చెందడంవల్ల దానికి అనన్యసామాన్య ప్రచారం లభించింది. అభ్యుదయ రచయితలకు సంఘానికి మహాప్రస్థానం విద్యుత్తును సరఫరా చేసింది.

శ్రీశ్రీని చదవడమంటే మార్క్సిజాన్ని (వస్త్వవగాహనకోసం), సాహిత్యోద్యమాలనూ (సంవిధానావగాహనకోసం) చదవడమే అవుతుంది.

శ్రీశ్రీ కవిత్వాన్ని అవగాహన చేసుకోవడంలో అవరోధాలూ వ్యాసఘట్టాలవంటివి. శ్రీశ్రీకిగల శబ్దశక్తి అపూర్వం కావడం వల్లనూ ఆయనశబ్దాలను అభిధా లక్షణా వ్యంజనా శక్తులనుదాటి సంజ్ఞావాదపు నూత్న సాంకేతిక సంగీతశక్తితోనూ పదచిత్రవాదపు ధ్వనిశక్తితోను రసోద్దీపనశక్తితోనూ జ్ఞాపకీకరణశక్తి Evocative Power తోనూ వాడటం వల్లనూ పదార్థ పరిశీలనలో పనిచేయవు. సాహిత్యఇజమ్‌లను తెలుసుకుని వాటితత్త్వాన్నీ, అవి ప్రతిపాదించే భావవాతావరణాన్నీ అనుభవించి వ్యాఖ్యానించాలి. శ్రీశ్రీ వ్యుత్పత్తి వాస్తవాలను గుర్తించి, వాటిని పరిశీలించి, ఆయాకాలాలలో రచించిన కవితలను పరిశీలించాలి. లేకపోతే ఎన్నోకువ్యాఖ్యలు వచ్చే అవకాశం ఉంది. అటువంటివి ఇదివరకే కొన్ని వచ్చాయి కూడా.

---

1978 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి నుంచి పి. హెచ్. డి. పట్టంపొందిన థీసిస్సును గురించి సంగ్రహపరిచయం.
రిసెర్చి డైరక్టర్ : ఆచార్య డా॥ యస్వీ జోగారావు, ఎం. ఏ., పిహెచ్. డి.

శ్రీశ్రీ కవిత్వం వర్తమాన కాలంలో నుంచి పొటమరించి భవిష్యత్తులోకి ఎగురుతూపోయే లక్షణం గలది. ప్రపంచ రాజకీయాల చారిత్రక యాథార్థ్యాలు, నేపథ్యతత్త్వాలూ పరిశీలించకుండా ఆ వ్యాఖ్యానించడం నేల విడిచి సాము అవుతుంది. అందువల్ల కాలానుక్రమంగా శ్రీశ్రీ కవితలను పరిశీలించాను.

కవితా రంగంలో విప్లవీకరణం తేదలచిన ఏ కవి అయినా తన కావ్యదృక్పథాన్ని గురించి సంవిధానాన్ని గురించి తానే వ్యాఖ్యానించుకోక తప్పదు. కాలంకన్నా సమకాలికులకన్నా ముందుకతడు జరిగి పోవడంవల్ల వెనుకనున్న వారికోసం అతడీ బోధన నవలంబిస్తాడు. శ్రీశ్రీ అలాగే చేశారు. ఆయన నూతన కవిత్వానికి మేనిఫెస్టోలుగా కొన్ని సాహిత్య వ్యాసాలూ రచిస్తూ వచ్చారు. ఈ స్వీయకవితా సమాలోచనల తత్త్వాన్ని అవగాహన చేసుకున్నప్పుడు శ్రీశ్రీలోని వ్యాసఘట్టాలకు పరిష్కారం లభిస్తుంది. గ్రంథగ్రంథులను విడదీయడానికి ఆ పని చిత్తశుద్ధితో నిర్వహించాను.

వస్తువులో భేదం లేకుండానే పలు విధాలుగా బహుసంవిధానాలతో శ్రీశ్రీ రచనలు చేయగలరు. అందువల్లనే ఆయన కవితలలో ఏకవాక్యత ఉంటుంది. మహాప్రస్థాన గీతాలలో ఈ లక్షణ మెక్కువ. పాఠకుల అవగాహన కోసం - కొంత పునరుక్తి అయినా సంకోచించకుండా - పూర్వాపూర్వతర కవితలకూ ఉత్తరోత్తర కవితలకూ గల ఈ భావానుబంధాలను అధస్సూచికలలోనూ రచనా సముద్దేశాల లోనూ వివరించాను.

మహాకావ్యానికి పరిమాణంతో నిమిత్తంలేదని నిరూపిస్తాయి శ్రీశ్రీ కవితలు. శ్రీశ్రీ కవితలలోని హ్రస్వలిపి సంవిధానం అందులోని వస్తువును భూతద్దంలో వలె చూపిస్తుంది. అందువల్ల వస్తువూ సంవిధానమూ అర్ధనారీశ్వరత్వం భజిస్తాయి. కనుక నేవస్తుసంవిధానాలను విడదీయడం పెక్కుతావుల్లో సాధ్యపడదు. వాటిని వేర్వేరు ప్రకరణాలలో చర్చించడం కూడా వీలుపడదు. సంవిధానమనేది పెద్ద వ్యవస్థ. అందులోని శైలి, భాష, ఛందస్సు, లయ వంటివన్నీ అవయవకల్పాలుగా ఉంటాయి. వాటిని భేదించడం కూడా వీలుపడదు. శ్రీశ్రీ కవిత్వంలో, ఇవన్నీ పరస్పరాశ్రయాలుగా ఉన్నప్పుడు వాటిని విడతీసి వ్యాఖ్యానించదలిస్తే పునరుక్తి ఎక్కువవుతుంది. ఛందస్సు, లయ ఆయన రసావేశానికి జీవనదాతలు. ఆఖరుకు ఊనికలు, యాసలు కూడా అర్థ విస్తారం కలిగించేవే.

పై కారణాలవల్ల ఈ ఖండికలను విడివిడిగానే సమాలోచించడానికి నిశ్చయించుకున్నాను. ప్రతి ఖండికను ఆఖండికలోని వస్తు సంవిధానాలను వ్యాఖ్యానిస్తూ అధ్యయనాధ్యాపన విధానం అవలంబించాను. కవిత్వ విమర్శ కింతకన్నా సార్థక్యం ఉండబోదనుకుంటాను.

ఈ గ్రంథంలోని 87 ఖండికల సమాలోచనలకూ ఆ ఖండికల శీర్షికలే శీర్షికలుగా గ్రహింపబడ్డాయి. ఆ ఖండిక రచనా ముద్రణకాలాలు, ప్రథమ ముద్రణ పునర్ముద్రణల వివరాలూ ఆ పుటలోనే అధస్సూచికలో ఇవ్వబడ్డాయి.

ప్రతిఖండికకూ మొదట రచనా సముద్దేశం, సంవిధానం దిఙ్మాత్రంగా వివరింపబడింది. ఇది పాఠకుడి కావ్యప్రస్థానానికి తలుపులు తెరిచి ఉన్ముఖుణ్ణి చెయ్యాలనే అభిప్రాయంతో వ్రాయబడింది.

ప్రతి ఖండికాసమాలోచనంలోనూ ఆయా ఖండికల స్వరూప స్వభావాల ననుసరించి కొన్ని ఉపశీర్షికలు నిర్ణీతమయ్యాయి. అవి అన్నింటికి ఒకేలాగుండవు. భావనావైచిత్రి, వస్తుసమీక్ష, సంవిధాన పరిశీలనం, పదచిత్రాలు, ప్రతీకలు, పదశిల్పం, ఛందోవైచిత్రి, లయవైచిత్రి, ప్రాసవైచిత్రి, సమకాలీనముద్ర వంటివనేకం.

ఈ సమాలోచనంలో మార్క్సిజం, లెనినిజం మూలసూత్రాలను ఉటంకింపవలసి వచ్చినపుడు ఆయా ప్రమాణ గ్రంథాలలోని భాగాలను ఉద్ధరించాను. అలాగే పాశ్చాత్య సాహిత్య విమర్శకుల ఆణిముత్యాలవంటి వాక్యాలను - నాఅభిప్రాయాలను సముద్దీపితం చేయడానికి - ఉద్ధరించాను.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని మూడు ప్రధాన భాగాలుగా విభజించాను. మొదటి భాగం ప్రభవ 1927-28; రెండవభాగం స్వర్గదేవతలు 1928-33; మూడవభాగం మహాప్రస్థానం 1933-47. ప్రతిభాగానికి ముందొక ప్రవేశిక అనుసంధింపబడింది.

ఈమూడు భాగాలకూ చివర ఉపసంహారంగా సింహావలోకనం. సిద్ధాంతఫల ప్రధానం అనే 33 పేజీలవ్యాసం రచింపబడింది.

ఆతరువాత ఆంగ్లాంధ్రాల్లో నేను సంప్రదించిన గ్రంథాలనూ వ్యాసాలనూ వర్గీకరించిఆధారవాఙ్మయ సూచికలుగా ప్రదర్శించాను. రమారమి 100 ఆంగ్ల గ్రంథాలను సంప్రదించాను.

ఆధారవాఙ్మయ సూచికలలో కేవల సారస్వత గ్రంథాలే కాకుండా చరిత్ర, రాజనీతి, తత్త్వశాస్త్రం, మనశ్శాస్త్రం, సంస్కృతి, మతం, భౌతికవాదం, మొదలైన విద్యలకు సంబంధించిన గ్రంథజాలం కూడా చేర్చవలసివచ్చింది. శ్రీ శ్రీ కవిత్వానికి ఈ శాస్త్రాలూ విద్యలూ ఆధార భూమికలు కావడం విశేషం. శ్రీ శ్రీ వ్యుత్పత్తి ఛందో వ్యాకరణా లంకార శాస్త్రాలకు మాత్రమే పరిమితం కాదు. ఆధునిక వ్యుత్పత్తి పరిధీ విస్తారమైనది. అంతర్జాతీయవాది ఆధునిక కవిబాణి.

ఇక చివరివి అనుబంధాలు. వీటిలో మొదలిది శ్రీశ్రీ సాహిత్యజీవిత కాలానుక్రమణిక. శ్రీ శ్రీ జీవితం బహు విచిత్ర సంఘటనా పరంపరాసంకలిత. దాన్ని రచించడానికి మరింత కృషి అవసరమవుతుంది. అతని జీవితానికి సాహిత్యానికీ

గల బాంధవ్యం ఈ పరిశోధనలో నా కక్కడక్కడ అవశ్యకమయింది.

రెండవ అనుబంధంలో శ్రీ శ్రీ కి సమకాలికుల సాహిత్య నీరాజనాలను సంగ్రథించాను. సమకాలం వారిచే శ్రీశ్రీ ఎంత మెప్పుదల పొందాడో దానికి ఈ నివాళి వాక్యాలు నిలువుటద్దాలు.

మూడవ అనుబంధం ఈ పరిశోధన గ్రంథంలోని కవితల అకారాద్యనుక్రమణిక.

శ్రీశ్రీ కవిత్వం గురించి నాకు నేను చెప్పుకున్న పాఠాలే ఈ సిద్ధాంతగ్రంథం. ఈ సమీక్షణం తెలుగులో కొత్త అలంకార శాస్త్రానికీ కొత్త వ్యాకరణానికీ కొత్త ఛందశ్శాస్త్రానికీ దారితీస్తుందని నా విశ్వాసం. ఈ కృషిలో ఇదొక మజిలీ మాత్రమే. మొత్తం మీ గ్రంథం 739 పేజీలు.

సంప్రదాయాల అంధానుసరణంవిడిచి, సంప్రదాయాలను ఆధునికీకరించుకుని, అవసరమైనపుడు తిరుగుబాటు చేసి, విస్మృత సంప్రదాయాలను పునరుద్ధరణ చేసి, నూతన సంప్రదాయాలను స్థాపించి, కవిత్వాన్ని ఆధునిక మానవుడికి అంకితం చేయడమే శ్రీశ్రీ కవితా మహాసంకల్పం.

సంప్రదాయాలలోని సంకుచితత్వం,నీరసత్వం,నిష్ప్రయోజకత్వం శ్రీశ్రీ చేత క్షాళనం పొందాయి. స్వతంత్రమార్గం త్రొక్కడానికి సంప్రదాయాధ్యయనంఅత్యావశ్యకమని శ్రీశ్రీ కవిత్వ మిచ్చే సందేశం. కాని నూతన సంప్రదాయ స్థాపన శ్రీశ్రీ కవిత్వం వల్ల కలిగిన సిద్ధి. అతడు ప్రయోగదక్షుడు. కృతార్థుడు; వాక్పాశుపతం, లయ గాండీవం, వరాలుగా పొందిన సాహిత్య సవ్యసాచి; కవిత్వ ధనంజయుడు.

బూర్జువా ప్రపంచంలోనుంచి సోషలిస్టు ప్రపంచంలోకి నడిపించడానికి బయలుదేరిన కవినాయకుడతడు. ఇందులో కాలంకన్నా ముందుకు నడిచినవాడు. వేగంగా నడిచినవాడు. ఆయన కవిత్వమే మరోప్రపంచం. మరోప్రపంచపు వాస్తవికత ఆయన స్వప్నం.

అభ్యుదయ నిరోధకుల చేత కూడా ఓహో అనిపించుకోగల అభ్యుదయ కవిత్వం అతడు సాధించిన కళ. అభ్యుదయ నిరోధక కళాసాహిత్య వాదాలను కూడా తన అభ్యుదయోద్యమానికి పందిళ్లుగా వేసుకోగల చాకచక్యం అతని సొత్తు.

ఆధునిక సాహిత్య ప్రపంచంలో తెలుగుదేశపు సరిహద్దుల కవతల అంతర్జాతీయ కవిసమ్మేళనంలో తెలుగువారి తరఫున నిలుచోగలిగినవాడు శ్రీశ్రీయే.

నిన్నటి భావకవి శ్రీశ్రీ! నేటి అభ్యుదయ కవి శ్రీశ్రీ!!

రేపటి మరోప్రపంచం కవి శ్రీశ్రీ! మహాకవి శ్రీశ్రీ!!




# కైకేయి

[గ్రంథకర్త: భాషాప్రవీణ కందుకూరి శ్రీరామచంద్రమూర్తి, ఎం. ఏ. వెల రు. 5-00 లు. ప్రతులకు : కందుకూరి చినరామమూర్తి గారు. తూరంగిగరువు. రవీంద్రనగర్, జగన్నాథపురం, కాకినాడ-2]

సంస్కృత సాహిత్యమున తౌల్యము కలిగించి యనను కరణీయులైన కవులలో వాల్మీకి ప్రథముడు. వాని పాత్రచిత్రణ మనోహరము, విచిత్రము. అతని రామాయణమును ప్రధానముగ కవితా దృష్టితో జూచుట ముఖ్యము. కాని దానిని మతపరముగ, వైదాంతికముగ, నింకను బహువిధముల జూచు విమర్శకత మనయాంధ్రులలో కొంత సహజమైనను, మరికొంత యితర ప్రాంతీయుల దృష్టితో గలిసి యాపాతమధురమై 'తృతీయఃపంథాః' యన్నట్లు కావ్యగతిని వీడిన దనిపించును. కావ్యమున పాత్రచిత్రణలో తాత్త్వికత మున్నగువానిని వెదకిసాధించి దానిని కవి కాపాదించి యందువలన తమకౌశలమును ప్రకటించుకొన్నవారు కొందరు. ఒక గ్రంథమునకుగల వ్యాఖ్యాన బాహుళ్యము వ్యాఖ్యాతల పాండితిని దెలుపుటలో ప్రధానపాత్ర వహించును. కానిచో కొన్ని సవరణలను, వివరణలను దృష్టిభేదమున బ్రపంచింపవచ్చును. పాత్రపరిశీలన పెచ్చుపెరిగి మితిమీరి శాఖాచంక్రమణము నంది తుద కెక్కడికో కొనిపోవును. 'కావ్యోపేక్షితలు'గా బేర్కొనబడిన పాత్రలు కైక, ఊర్మిళ మున్నగువారిని విమర్శించినవారు గమనింపవలసినది యిది. వాల్మీకి యాపాత్రల నట్లేల చిత్రించెను? ఆ చిత్రణలోని విశేష మేమి? కావ్యప్రాణమైన 'ధ్వని' వాచ్యమగుట సమంజసమా? శ్రీరాముని పాత్రకు, కృష్ణుని పాత్రకు గల భేద మేమి? కవి వివక్షిత మేమి? వాల్మీకి శ్రీరామునిలో మనుష్యత్వమునే ప్రధానముగా చిత్రించెనుకదా! అట్టిదానిలోని పాత్రలను మథించి తుదకుమూలఘాతుకమైన రీతిలో నిర్వహించుట పాండితీధౌరంధర్యమును వ్యక్తపరచునేమో కాని సర్వసుకుమారమైన కవి విమర్శకమార్గమును కంటకితమును చేయునుకదా! రామాయణములోని పాత్రలవృత్తములు పరిశీలించి 'కవిరత్న' ప్రభృతులు కొందరు యథాశక్తిగా నుపేక్షితపాత్ర పరామర్శము గావించి కావ్యరచన గావించిరి. అట్లువచ్చిన కావ్యములలో 'కైకేయి' యొకటి. దీనిని రచించినవారు శ్రీ కందుకూరి శ్రీరామచంద్రమూర్తి గారు. వీరు

బహుపట్టభద్రులు. పండిత వంశజులే కాక విపండితులు నగుచున్నారు.

కైకేయి సుమారు 423 పద్యములుగల బృహత్ఖండ కావ్యము. ఇందు సౌధము, శాపము మున్నగు ముప్పదిశీర్షికాఖండము లున్నవి. వీరిందు కైకేయిని పశ్చాత్తప్తురాలినిగా, తాత్త్వికురాలినిగా, యోగినీసదృశగా, భాగవతురాలినిగాఁ జిత్రించి రామాయణాంతర్గత కైకేయీతత్త్వమును యథాశక్తిగ నీవలకుఁ దెచ్చిరి. మంథర పూర్వజన్మను, ధవళాంగుని వృత్తమును, కల్పితప్రాయములుగా నిం దిమిడ్చిరి.

శ్రీరాముడడవి కేగినపిమ్మట వశిష్ఠుఁ డొకనాటి రాత్రి యయోధ్యాసంచారము చేయుచు కైకేయి యంతిపురమున కరిగెను. మిగిలిన నగరమంతయు చింతావిహీనమై స్వకార్యానుష్ఠానములో నుండి శ్రీరామ వియోగబాధను మరచియుండెనట. దుఃఖవివశయైన కైకేయి తన బహుభావశబలమగు హృదయము నాతనికి వివరించి తన లోభాదికమును, పుత్రతిరస్కారమును, పశ్చాత్తాపమును భాగవతమార్గాసక్తిని వెల్లడించును. వశిష్ఠుడామె నోదార్చి శ్రీరాముడడవులపాలగుటలో నామెకుగల పాత్ర లోకోపకారకమైనదని సూక్ష్మముగా వివరించి శ్రీరాముని విష్ణుత్వము నుద్బోధించును. దీనికి ప్రోద్బలముగా కైకేయి ధవళాంగుడను మునికి కన్యాత్వమున సేవచేసి వాని దయవలన మాయావినాశకశక్తి నందినట్లుగా వివరించిరి. మరియు మంథరావృత్తాంతమును వివరించిరి. మంథర విరోచనుడను రాక్షసరాజుకుమారి యనియు దేవజిగీషువై తపమాచరించుటకుఁ దండ్రివెళ్లగా దండెత్తి వచ్చిన యింద్రుని, పలాయనవాదులైన పెద్దలసూచనను తిరస్కరించియెదుర్కొని, యింద్రుడు తన్ను సంహరింపసందేహించుచుండగా నుపేంద్రుని ప్రోద్బలమున వానిచే మడిసి పగదీర్చుకొనగా నెంచి యిట్లు కైకకు దుర్బోధ యొనర్చినట్లు వివరించిరి. కైకేయీ స్వగతవివరణలో శ్రీరాముని వనగమనమును, వాని బాల్యమును వివరించిరి. రాత్రివేళ బాలరాముని దేవతలు ప్రార్థించుట గాంచినట్లు వివరించినది. తుదకు వశిష్ఠుడామెకు తత్త్వోపదేశము గావించి యోదార్చును.

వశిష్ఠుడిక్ష్వాకుల కులగురువు. అట్టివాడు రాత్రివేళ యనాహూతుడై నగరసంచారము చేసి యంతఃపురప్రవేశము గావించుట వశిష్ఠుని పాత్రకుగాని యిక్ష్వాకువంశమునకుగాని సముచితముగా లేదు. కైకేయి తన హృదయము నింతగా నిన్నివందల పద్యములలో వివరించుట వశిష్ఠుడామె నోదార్చుట యిదియంతయు నేకరాత్రవృత్తము గావించుటయు నిట్టిదే యనవచ్చును. కైకేయి వశిష్ఠుని నాపాలి కల్పకృతీ యని, ప్రభూ! యని సంబోధించుట బాగుగా లేదు. తెనుఁగులోని కొన్ని నుడికారములను సంస్కృతీకరించుట భాషాపాండితీసూచకమైనను, నారజతాద్రి, వంటివి సద్యస్స్ఫోరకములు గావు. అన్వయక్లేశము తరచుగా నిలబెట్టును. సాహితీ విదూరవర్తి కైక తనకు విశేషణముగా జేసికొన్నచో విదూరవర్తిని కావలయును.

భర్తకం చెన్నుడు, గోణుగుకొంచింత స్నేచి, హాయి, కనంగదే మున్నగునవి కలవు. ఒక్కతొయ్యలికి ముందుంబల్కని స్తేజుడై (క్రీగీటు గీచినది దేనికో?) అధ్వాన్నంబు, (నిందార్థకము) నిస్త్రాణము (నీరసము) వంటివి సద్యస్స్ఫోరకములు కావు. లోకోజస్కుడు (వృద్ధిరావయునేమో) ఆత్మజోతివంటివి కలవు.

కైక శ్రీరామునికి కౌసల్యవంటి దని వాల్మీకిస్పష్టము చేయును. అట్టి దగుటచేతనే యామె రాముని యభిషేకవార్త విని మంథరకు బహుమాన మీయబోవును. కైక మంథరోపదేశమున, సపత్నీసహజ మాత్సర్యమునను, పుత్రప్రేమ చేతను రాముని నడవులకంపి భరతుని యభిషేకమును గోరుచు వనవాసకాల నిర్ణయము చేయుట యామె యమాయికత యనుకోవచ్చునేమో? లేక నాటి వ్యవహారములలో పదునాల్గేండ్ల కాలము నేటి చెల్లువేయని ప్రామిసరీ నోటునకు మూడేండ్ల గడువు వంటిదేమో?. రాజ్యకాంక్షా పూర్ణయైన కైక శ్రీరామ విప్రవాసనమున సంపూర్ణ క్రౌర్యయైనది వాల్మీకి 'కైక' క్రూర, పరిణామదయనీయ. అయినను శ్రీరామునకు మాతృస్థానీయ. ఆమెను రామభక్తురాలినిగా జిత్రించుట కావ్యమర్యాదకు విరుద్ధము, వరములను సాధించిన కైక భాగవతోత్తమురాలుకాగా, వరదానస్మారకురాలైన మంథర రాక్షసత్వమునందు టేల? భరతుని మాతృదూషణమును భరద్వాజుడు శ్రీరాముడు నిషేధించిరికదా! కైక తెలియక చేసిన రామనిర్వాసనమును రాక్షససంహారకముగ సమర్థించిన; దశరథుని మృతినెట్లు సమర్థింతురు. శ్రీరాముడు వాల్మీకిచే మానవుడుగా జిత్రింపబడినాడు. దైవముగా కాదు. వాని మహత్తును మునులు గుర్తించియుండవచ్చును. సూచించియుండవచ్చును. పాత్రపరిశీలనవివరణ, మున్నగునవి సముచితములేకాని మితిమీరి మూలఘాతుకములై కావ్యమార్గమును వీడరాదు, తాత్త్వికతాదులే ముఖ్యములన్నచో నేమియు లేదు.

కవిగారి పద్యశైలి, శబ్దార్థవిన్యాసము, మున్నగునవి ప్రశంసనీయములు. పాత్రచిత్రణమున, రసవిషయమున కొంత సంయమనము, విచారణ చేసి ముందునకు సాగుట కవికి ముఖ్యకర్తవ్యము. కావ్యమునకు గావలసిన సామగ్రి వీరియొద్ద పుష్కలము. శ్రీ వెంపరాలవారు, జోస్యులవారు, శ్రీ కేశిరాజువారు, శ్రీగుంటువారు, శ్రీబులుసువారు దీనిని బహువిధములుగ వివరణాత్మకముగ ప్రశంసించిరి. శ్రీకవిగారింకను మనోహరములైన కావ్యములను రచించి సహృదయానంద మొనర్పగలరను నమ్మికను వీరిపద్యనిర్వహణము, తదితర సామగ్రి కల్గించును. వీరా నమ్మికను సార్థకము గావింతురుగాక

# శిలాస్వగతమ్

— చల్లా రాధాకృష్ణమూర్తి.



ముందుగా మాతృభాషలో రెండు మాటలు. ఈమధ్య రాజమహేన్ద్రవరంలో, ఒక సినిమా థియేటరు కట్టేందుకు పునాదులు త్రవ్వడంలో, రెడ్డిరాజులనాటి ఒక నన్దివిగ్రహం బైటపడింది. దానిపై 'మృకండు లింగానకు మారెళ్ళ భీమన సమర్పించిన నంది' అని ఉంది. దాన్ని అక్కడినుంచి తరలించి, రాళ్ళబండి సుబ్బారావు ప్రభుత్వపు ప్రదర్శనశాల ముందు ఉంచారు.

తన పూర్వనివాసమైన మృకణ్డేశ్వరాలయం మహమ్మదీయులచే ధ్వంసం చేయబడగా, తను మట్టుకు నిలిచిఉండి, దైవవశాత్తూ ఈనాటికి ప్రజల కంటపడినా, ఎండకు ఎండి వానకు తడిసి, పూజాపురస్కారాలు లేక పడిఉన్నందుకు వగస్తున్నట్లూ; అయినా వెనుక ఇటువంటి అవస్థే పొందిన ఇతర విగ్రహాలు పునః ప్రతిష్ఠింపబడినట్లే, తనకు కూడా మళ్ళీ మంచిరోజులు రాకపోవని భావిస్తున్నట్లు ఆయా నన్దియొక్క 'స్వగతం' అమరవాణిలో మనవి చేయబడుతుంది.

'పాషాణా దపి పీయూషం స్యన్దతే' ఇతి, 'అపి గ్రావా రోదితి' ఇతి చ ద్వివిధే అభియుక్తోక్తీ।

ఊం, కిం బ్రవీమి? మత్తః పాషాణాత్ సమ్ప్రతి పీయూషం స్యన్దయితుం యః కోఽపి ప్రభవతివా? ఉత మమ దుఃఖతప్తస్య గ్రావ్ణః, కేవలం రోదన మేవ శరణ్యం వా?

ఆస్తాం తావత్ ఇహ మమ పురస్తాత్ ప్రవహతి గోదావరీ – యాసా వాగ్దాత్రీ ('గో' + 'దా'నదీ), నైకకవి జనయిత్రీ, మా మపి వక్తారం విదధాతు.

హన్త! దిష్ట్యా కాలగర్భాత్ భూగర్భాచ్చ ఉత్థాపితోఽపి, పునః ఈశ్వర సన్నిధాస్థాతుం న పారయా మ్యహో కలికాల మహిమా! అస్తు। యద్యపి మమ ఘాతికాశ్రయో నిరాకృతః, తథాపి మన్మనో నేత్రస్య వీక్షణం నిరాకర్తుం కేన శక్యతే? యస్మాత్ అస్య పత్తనస్య చరితం ఈషత్ స్మరామి, తస్మాత్ మనాక్ మనః స్థైర్య మవాప్నుయామ్।

ఆదౌ తావత్ స్మరణయోగ్యః సుప్రథితో రాజరాజఏవ పరన్తుయది అధునాతనాః ప్రజాః చలనచిత్ర పదర్శనశాలా నిర్మాణే యాదృశీం ఆస్థాం ప్రదర్శయన్తి, తాదృశీం ఆసక్తిం మమ స్వస్థానస్య అధస్తాత్ పార్శ్వయోశ్చ ఖననే నిరూపయన్తి, తర్హి రాజరాజాదపి పూర్వేషాం కేషాం చన రాజ్ఞాం చ బౌద్ధ,జైనాదీనాం చ స్మారక చిహ్నాని ద్రష్టు మర్హన్తి।

ఆమ్। అథ ఆన్ధ్ర ప్రశస్తి రూపకస్య సూత్రధారాభ్యాం రాజరాజనరేన్ద్ర నన్నయ భట్టారకాభ్యాం నమః. హే ధన్యౌ యువాం న కేవలం రాజమహేన్ద్రిపుర్యాః ఖ్యాతేః బీజభూతౌ అపితు ఆన్ధ్ర సంస్కృతేశ్చ సృష్టికర్తారౌ విజయేథేతరామ్।

భో రాజరాజ! లౌకికసామ్రాజ్యవిజయేన న త్వం సంతృప్తః; అథవా మాతృభాషాభిమానాత్ తమిళ భాషాప్రచారం అత్రకర్తుం నోద్యుక్తశ్చ భవాన్ యస్మిన్ ప్రదేశే యా భాషా ప్రవర్తతే, తాం భాషాం తత్రత్యానాం జనానాం కృతే ధర్మప్రచోదయిత్రీం కర్తుం వ్యవసితో భవాన్। 'యత్రధర్మరక్షా న క్రియతే తత్రరాజ్యలాభేన కిం?' ఇతి భవదభిమతం సఫలీకృతవాన్ అత్రభవాన్ నన్నపార్యః।

అయిభో ఆన్ధ్రాః ఆదికవే, నన్నయార్య! కేన విధానేన త్వాం పూజయామి? కింవా, భవతః కర్మ - క్రియా - యోగ-జ్ఞానమార్గాన్వితం ఈశ్వరాగమ ప్రతిపాదనం సమ్భావయామి? కింవా, తవ వైదిక మార్గనిష్ఠా స్తవనీయా మయా ? కింవా భవదక్షర బ్రహ్మతత్త్వ జ్ఞానం భజామి ? కింవా, విశేషతః ప్రకీర్తితవ్యః తవ సారస్వత మహాయజ్ఞః ?

యత్ కిమపి వా భవత్ సులక్షణం భణనీయం, తదేకం పరమసత్యం దరీదృశ్యతే యత్తవ భారతాన్ధ్రీకరణేన జనసామాన్యం దురితదూరం నిర్వర్తితమ్। తథాపి త్వయైవ నందంపూడి శాసనే ప్రకటితమ్: ప్రీతాః ప్రజాః నిజపవిత్ర చరిత్రతోయైః ప్రక్షాలయన్తి కలికాలకలఙ్క పఙ్కాన్ ఇతి।

హుం, కి మేతత్? హా రాజమహేన్ద్రి నగరి! తదేతయోః రాజరాజ కవిరాజయోః దివంగతయోః సతోః, శతాబ్దద్వయాధిక-కాలావధౌ భవతీ నిర్వీర్యైవ ఆసీః। కిన్తు, యత్రాన్తరే తురుష్కైః తవ దేవాలయాదీనాం శైథిల్యం కృతం, తదాపి తవ సహజ శోభా నితాన్తం నాస్తంగతా। అచిరేణైవ మమ సమకాలికే రెడ్డి ప్రశాసనే త్వత్పునరుజ్జీవనం సమ్పాదితమ్। తస్మిన్నవసరే కశ్చనభక్తః మమ రూపమిత్థ మకారయత్।

హే మృకణ్డుమహర్షే! త్వయా ప్రతిష్ఠితస్య ఈశ్వరస్య వాహన ద్వారపాలన కార్యోపజీవ్యహం నమస్యే త్వామ్। తవారాధ్యోఽయం 'మృకణ్డేశః', దక్షారామ 'భీమేశ్వరస్య' 'అఙ్గః' ఇతి ప్రస్తౌతి భీమఖణ్డాఖ్యే కావ్యే శ్రీనాథ కవిసార్వభౌమః। అయే శ్రీనాథకవే, త్వంసాక్షాత్ కవి శ్రీనాథ ఏవ। త్వదీయో రాజమహేన్ద్రి పురావాసస్తు ఏతస్య తత్కాలకృత 'విద్యానగర' బిరుదస్య నిదానం ఖలు? యస్త్వం పెదకోమటి వేమారెడ్డి వర్యస్య ఆస్థానీ 'విద్యాధికారి' పద మలంచకర్థ, ఏతన్నగరవైభవ మేవ మవర్ణయః కిల :—

"కమలాచలాగ్ర మార్కణ్డేయ శివశిరః
శశిచన్ద్రికా ధౌత సౌధవీథి
గోదావరీ పుణ్యకూలంకషా జలా
స్ఫారితశ్రీ రుద్రపాద యుగళి
బలవదభ్యున్నత ప్రాకార పరివేష
గణ్డూషితా జాణ్డమణ్డలంబు
గన్ధదన్తావళి గ్రైవేయ ఘణ్టికా
ఝఙ్కార ముఖర ఘణ్టాపథంబు
రాజబిమ్బాననా నూత్నరత్నపేటి
వీరరాహుత్త సుభట కణ్ఠీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాన్ద్రవిభవంబు రాజమహేన్ద్రవరము"

అహోబత అచిరేయం రెడ్డిరాజకాలీనా మమ పురప్రభా। పునరపి మహమ్మదీయైః మన్నగరస్య ఆలయాదికం విధ్వంసితమ్।

కింను, యథాతత్ రెడ్డిరాజ స్థాపితం 'గౌతమీ విద్యాపీఠం' సామ్ప్రతం వినూత్న రూపేణ విభాతి; యథా అద్యాపి అస్మదీయం నన్నయారసత్వం అమరమితి సమర్థితం-స్వర్గస్థైః కందుకూరి,-చిలకమర్తి, వడ్డాది, శ్రీపాద ప్రభృతిభిః, ఇదానీం అస్మన్నికటే విరాజమానైః మధునాపంతుల, మల్లంపల్లి ఇత్యాదిభిశ్చ; యథా చ పునర్నిర్మితాః 'దక్షిణకాశీ' ప్రథాస్థానీయః కోటిలిఙ్గ క్షేత్రాలయః, నగరదేవస్య మార్కణ్డేయేశ్వరస్య మన్దిరం, అధునా 'పెద్దమసీదు' ఇత్యాఖ్యయా పరివర్తితస్య గోపాలస్వామినః ఆయతన, అన్యే తాదృశాశ్చ దేవాలయాః - తథైవ అహమపి న పునః ప్రతిష్ఠాపనం ప్రాప్నుయామ్?

[ ఆకాశవాణి విశాఖపట్నంవారి సౌజన్యంతో ]

# ఈ పక్షంలో

## నన్నయ జయంతి

ఇటీవల నూతనంగా ఏర్పడిన శరన్మండలి యాజమాన్యమున గౌతమీ గ్రంథాలయానికి చెందిన బాబాయమ్మ మెమోరియలు హాలులో నన్నయ జయంతి జరిగినది. మండలి ఉపదేశకులు శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు సభకి అధ్యక్షత వహించి ప్రసంగిస్తూ నన్నయకు, శరత్కాలానికీ కల సంబంధమును పరిశీలించి నన్నయ జననమరణములు శరత్కాలములోనే జరిగి యుండవచ్చు ననిరి. నన్నయ రచన విశిష్టమైన దనిరి.

ప్రసిద్ధ విద్వత్కవులు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు నన్నయభారతమును గురించి ఉపన్యసించిరి. గోదావరీ జలప్రశస్తిని గురించి, నన్నయ ఆత్మ రాజమహేంద్రవర ప్రాంతంలో ఇప్పటికీ పరిభ్రమిస్తూ ఉండడం గురించీ తమ భావనను వ్యక్తపఱచినారు.

'ముఖ్యముగా నన్నయ భారతము అనువాదము కాదు. మూలంలోని అనౌచిత్యాలను తొలగించి అనవసర సంఘటనలను విడనాడి స్వతంత్ర రచనగా దృశ్యకావ్యంగా ఆంధ్ర మహాభారతాన్ని రూపొందించా' రని అన్నారు. ఎన్నో ఘట్టములలో నన్నయరచన రసవంతమైన దన్నారు. అనుభూతి ప్రధానమైన దన్నారు. నన్నయ జాతీయత మూర్తీభవించిన, తెలుగులో కావ్యాలు వ్రాయడం అపచారం అన్న, దయమాన్ని ధిక్కరించిన విప్లవకవి అన్నారు.

తెలుఁగులో రసవత్కావ్యముగా భారత ముద్భవిల్లుటచే సంస్కృత భారతము మృతప్రాయమైన దనీ వాల్మీకి రామాయణం మృతగ్రంథం కాకుండా నిలిచి ఉండడానికి తెలుగులో భారతం

వంటి రసవంతమైన గ్రంథం ఇంతవఱకూ రాకపోవడమే కారణమనీ వక్కాణించినారు. విద్యార్థులకు నన్నయను గుఱించి చేసే పరిచయ విధానం బాగాలేదన్నారు. తిక్కన నాటకీయతకు నన్నయ మార్గదర్శకుడన్నారు. ప్రసిద్ధములైన నన్నయ పద్యాలన్నీ అమూలకములే అన్నారు. వస్తుప్రధానంగా వుండే అనువాదంలోని వైరస్యం అంటూ ఒండు రెండుదాహరణలేచటివో ఇచ్చియున్నారు. మొత్తం సంస్కృత భారత రామాయణాలు అనౌచిత్యాల పుట్టలని ధ్వనింపజేసారు. భారతం అనువాదం కాదన డానికి తమ ఉపన్యాసంలో ఎక్కువకాలాన్ని వినియోగించారు.

"నన్నయ రచన యథామూలానువాదమని ఇంతవఱకూ ఎవరు సిద్ధాంతీకరించినారో తెలియదు. కొన్నిచోట్ల మార్పు చేర్పులు చేసినంతమాత్రాన అనువాదమే కాకుండాపోతుందా? మానవజీవిత నిత్యపాఠ్యగ్రంథాలయిన భారత రామాయణాలని వారి భాషలోనే ఆంధ్రుల కందజేయాలనే మహోన్నతాశయంతో నన్నయ ఆంధ్రీకరణకు పూనుకొన్నారన్నారు. మూలగ్రంథాలు మానవజీవిత నిత్యపాఠ్యగ్రంథా లనడం; ఆంధ్రీకరణం అనడం; ఆంధ్రీకృతగ్రంథ వైశిష్ట్యం వల్ల సంస్కృత గ్రంథాలు మృతగ్రంథాలయ్యాయనడం; ఏలా సమన్వయ పడతాయో తెలియదు.

నన్నయ రచన సంస్కృత ప్రచురమనీ; అక్షర రమ్యత, కథాకలితార్థయుక్తి కలది అనీ; విద్యార్థులకి పరిచయం చెయ్యడం మాని నన్నయ జాతీయకవి అనీ సంస్కృత గ్రంథాన్ని మృతప్రాయంగాచేసిన మహాకవిఅనీ విప్లవకవి అనీ పరిచయం చెయ్యడం ఔచిత్యశోభితంగా వుంటుందని వారి అభిప్రాయమా ? పది మొదలు 100 వఱకు మాత్రమే ఉండే పాఠ్యగ్రంథ పద్యాలలో నన్నయ రచనలోని సొగసులన్నీ వారికి వివరించాలనా? నన్నయ కర్తృకమగునా కాదా యనుకొనుచున్న చింతామణిలోని స్వస్థాన వేషభాషాభిమతా స్సంతః రసప్రలుబ్ధధియః అన్న వాక్యంనుబట్టి నన్నయ జాతీయాతాభిమాని అని నిర్ధారించినపుడు భారతంలోని అనేక శ్లోకాలకు ప్రతిమూర్తులా అన్న పద్యాల్ని కలిగియున్న గ్రంథం అనువాదం అన్నందువల్ల వచ్చిన హాని యేమి? తెలుగులో గ్రంథరచన పనికిరాదని శాసించిన దెవరు? సంస్కృతం విశేషవ్యాప్తిలో ఉంటే దేశభాషలు నిషిద్ధములైనట్లేనా ? నన్నయకు పూర్వం గ్రంథ రచన జరగనేలే దన్నది సర్వసిద్ధాంతమేనా ? అనుభూతి లేని కవిత ఉంటుందా ? సంస్కృత భారతరామాయణాలు ఏ అనుభూతినీ కలిగింపలేనివేనా ? ఔచితీ రసపూరితములైన మూలములోని కొన్ని అంశాలు నన్నయ స్పృశింపని విషయం గుఱించి శ్రీశాస్త్రిగారికి గల ఆలోచన లెట్టివో? నన్నయ రచనలో మూలమందలి సొగసులు తగ్గిన సందర్భాలు కూడా కొన్ని ఉన్నాయంటే శ్రీశాస్త్రిగారు ఏమంటారు ? సంస్కృతభారత కాలం, లక్ష్యమూ; తెలుగు భారతకాల లక్ష్యాలూ ఎట్టివి?

నన్నయ రచనా సౌందర్యాన్ని గుఱించి ప్రస్తావించేటపుడు పెక్కుసందర్భాలలో ఉదాహరణలు చూపక పొడిమాటలుగానే ఉపన్యాసం జరగినది." ఇట్టి భావాలతో సహృదయులైన కొందఱు సదస్యులు అసంతృప్తులైనట్లు గోచరించింది.

ఈ విధంగా ప్రతిసంవత్సరం శరన్మండలి శరత్కాలంలో నన్నయ జయంతి జరపుటకు నిశ్చయించింది. శ్రీ హనుమచ్ఛాస్త్రిగారిని 116 లు నూతన వస్త్రాలతో సత్కరించారు. శ్రీ వై. యస్. నరసింహారావు గారి వందన సమర్పణములతో సభముగిసింది.

ప్రతిసంవత్సరం కవి సత్కారానికి 116 లు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు ఇచ్చే నిర్ణయం ప్రకటింపబడింది! సమావేశ ప్రారంభంలో శ్రీమతి వేదుల మీనాక్షిగారు నన్నయకు పద్య కుసుమాంజలి సమర్పించారు. పద్యపఠనం వివరణ రహితంగా ఉంటే బాగుండేదని కొందరు భావించారు.

## సారస్వత సమితి

19-11-78 న శ్రీ లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో రాజమండ్రిలోని సాహిత్యాభిమానులు కొందరు, శ్రీ విశ్వనాథ గోపాల కృష్ణమూర్తిగారు ముఖ్యఅతిథిగా, శ్రీ పన్నాల వెంకట్రామయ్యగారు అధ్యక్షులుగా సమావేశమైరి. సంస్కృత భాషా ప్రచారమును నిర్వహించుటకు, హైద్రాబాదువారి, చిత్తూరువారి సంస్కృత పరీక్షలు నిర్వహించుటకు, ప్రతినెల ఒకపండితునిచే సారస్వతోపన్యాస మిప్పించుటకు నిర్ణయింపబడినది. పైసంఘమునకు సారస్వత సమితి అని పేరిడిరి. శ్రీ బుగ్గా పాపయ్య శాస్త్రిగా రధ్యక్షులుగా, శ్రీపన్నాల వెంకట్రామయ్యగా రుపాధ్యక్షులుగా, శ్రీ చేబోలు శేషగిరిరావు గారు కార్యదర్శిగా, శ్రీసాంబశివరావు గారు, శ్రీవీర్రాజు గారు సహాయ కార్యదర్శులుగా శ్రీ మెరపల సన్యాసి రావుగారు కోశాధికారిగా ఎన్నుకోబడిరి. శ్రీ నరసింహాచార్యులు గారు, శ్రీ పున్నమరాజు నాగేశ్వరరావు గారు, శ్రీ కృష్ణమూర్తి గారు, శ్రీ ప్రసాద్ మొదలగువారు సభ్యులుగా ఎన్నుకోబడిరి. *

---

[ స్థలాభావంవల్ల ఈసంచికలో ప్రచురింపవలసిన "శ్రీనాథ కవితా వైశిష్ట్యం" ముందుసంచికకు నిలిపియుంచఁబడినది. ]

– సంపాదకుడు.

# బి. వి. అండ్ కో., పుస్తకములు

బి. ఏ., బి. యస్ సి., బి. కాం. తరగతుల I, II సంవత్సరముల తెలుగునోట్సు (ఆంధ్రా యూనివర్సిటీ) అన్నియు ముద్రింపఁబడి ప్రతులు సిద్ధముగా నున్నవి. కొన్నిరకముల ప్రతులు చాల తక్కువగా నున్నవి. త్వరపడుట మంచిది.

ఇంటరు I, II సంవత్సరముల తెలుగు, ఇంగ్లీషునోట్సు; X తెలుగు, ఇంగ్లీషు, హిందీ నోట్సు అన్నియు సిద్ధముగా నున్నవి. ఇంటరు తెలుగు ప్రోజు నోట్సు నూతన ముద్రణము పూర్తిఅయి ప్రతులు సిద్ధముగా నున్నవి. వెల రు 5-50 లు.

బి. వి. అండ్ కో.,
6 - 8 - 7, ఇన్నీసుపేట
రాజమండ్రి - 1.

---

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు వీలైనంతవఱకు ప్రయత్నింపఁ బ్రార్థన.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

- సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.

---

# చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్సు వెల పోస్టేజీతోసహా రు 18-00 లు ఎం. ఒ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును.

— సంపాదకుడు 'సమాలోచన'

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet,
(Tyagaraja Nagar) Rajahmundry-1.